Regd. No. H.N.L. 18

9.7.1993 [illegible] 10 పేజీలు [illegible] 2.00

# జమీన్‌రైతు

స్థాపకుడు:నెల్లూరు వెంకట్రామానాయుడు

## పెద్దల్లుడి మాటే చెల్లుబాటు

వచ్చే శాసనసభ సాధారణ ఎన్నికలకోసం తెలుగుదేశం పార్టీ డ్రెస్ రిహార్సల్ మొదలుపెట్టింది. శాసన సభ ఎన్నికలకు ఇంకా ఏడాదిన్నర సమయం వున్నప్పటికీ అర్యాన్ని ప్రచారం ద్వారా కాంగ్రెస్‌పై పైచేయి కావాలని తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్టీరామారావు భావిస్తున్నారు. దీనికోసం ఆయా నియోజక వర్గాల్లో అభ్యర్థులను ఖరారుచేసి నియోజకవర్గాల్లో వదలాలని ఆయన ఒకవ్యూహం రూపొందించారు. ఇప్పటికే మాటాయాత్ర అసెంబ్లీ నియోజక వర్గాల్లో అభ్యర్థుల ఎంపిక కార్యక్రమం పూర్తయింది. అభ్యర్థుల విధేయత, ఆర్థిక వనరులు, కులం, విజయావకాశాలను దృష్టిలో పెట్టుకొని ఎంపిక చేశారట. ప్రస్తుతం అమెరికా పర్యటనలోవున్న ఎన్టీఆర్ తిరిగి వచ్చాక మిగతా అభ్యర్థుల ఎంపికను కూడా పూర్తి చేసి నియోజకవర్గాల్లో ప్రచార రంగాను మోగిస్తారట. ప్రచారంలో ముఖ్యంగా కాంగ్రెస్‌పార్టీ అధినాయకుల కుంభకోణాల్ని ప్రస్తావిస్తారు. ఇందుకు సంబంధించిన సమాచారాన్ని అభ్యర్థులకు ఇస్తారు. ఇలా వుండగా తెలుగుదేశం పార్టీలో జరుగుతున్న అంతర్యుద్ధం, అల్లుళ్ల మధ్య పోరు తారాస్థాయికి చేరుకుంది. అభ్యర్థుల ఎంపిక సందర్భంగా ఎన్టీఆర్ చిన్నల్లుడు

కొరవ 6 వ పేజీలో

## నెల్లూరు దేశం జాబితా రెడీ?

నెల్లూరు జిల్లాకు సంబంధించినంత వరకు అభ్యర్థుల ఎంపిక అవితూచి చేస్తున్నారట. ఇంతవరకు వెంకటగిరి, కోవూరు, సర్వేపల్లి, రాపూరు, ఆత్మకూరు, నెల్లూరు నియోజక వర్గాల్లో అభ్యర్థుల ఎంపిక పూర్తయింది. నెల్లూరు టి. రమేష్ రెడ్డి, రాపూరు తేగా నారసింహా రెడ్డి, కోవూరు నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి, సర్వేపల్లి, చంద్రమోహన్ రెడ్డి, ఆత్మకూరు వై.టి. నాయుడు లేదా కృష్ణారెడ్డి. వెంకటగిరి నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డి పేర్లను ఎన్టీఆర్ ఖరారుచేశారు. ఎన్.జనార్దన రెడ్డికి బదులు ఆయన సతీమణి శ్రీమతి ఎన్. రాజ్యలక్ష్మి పోటీ చేసే పక్షంలో స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి భార్య శ్రీలక్ష్మమ్మను వెంకటగిరిలో నిలబెట్టి, చంద్రశేఖర రెడ్డిని కోవూరుకు పంపుతారట.

****

## జె.కె. కాంగ్రెస్‌లో చేరడం నిజమా?

నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి కాంగ్రెస్ లో చేరుతున్నట్లు వార్త. జెకె ఎప్పుడూ కాంగ్రెసేయుడే. ఇప్పుడు కొత్తగా తీర్థం పుచ్చుకోవాల్సిన అవసరం లేదు. కాని గెల్చింది స్వతంత్రుడిగా కాబట్టి, అధికారికంగా దూరంగా వున్నాడు. పదవుల అధిరోహణకు అది ఆయనకు పెద్ద అడ్డంకి అయింది. జెకెతో పాటు రాష్ట్రంలో మరి తొమ్మిది మంది స్వతంత్రులున్నారు. వారిలో ఇద్దరు తెలుగుదేశమీయులు; తక్కిన వారు కాంగ్రెస్ నుంచి తిరుగుబాటు చేసి గెల్చిన వారే. కాంగ్రెస్ స్వతంత్రులంతా ఇప్పటికే సిఎల్‌పిలో అసోసియేట్ సభ్యులు. వారు లెజిస్లేచర్ పార్టీ సమావేశాలకు హాజరై, మాట్లాడవచ్చుకాని ఓటు వేసే హక్కుండదు.

స్వతంత్రులందరి తరఫున శ్రీ జగపతి రావు పిసిసి కలిసి తమను పార్టీలో అధికారికంగా చేర్చుకోమని కోరారట. అందుకు పిసి సమ్మతించాడు. ఇంతకాలం ఈ పని ఎందుకు జరగలేదు అని ఆయన పిసిసి అధ్యక్షుణ్ని ప్రశ్నించారట. అయితే పిసి పచ్చ జెండా చూపినంత మాత్రాన స్వతంత్రుల కాంగ్రెస్ చేరిక సాధ్యం కాదని చెప్తున్నారు. దానికి ఫిరాయింపుల చట్టం రెడ్ సిగ్నల్ వుంది. స్వతంత్రులు ఏ పార్టీలో చేరకూడదని చట్టంలో స్పష్టంగా వ్రాసి వుంది. స్వతంత్రులు అసెంబ్లీ వ్యవహారాలలో సౌకర్యం కోసం ఏర్పాటు చేసుకొన్న ఫ్రంట్‌కు ఫిరాయింపుల చట్టం గుర్తింపు రాదు. అందువల్ల మూకుమ్మడిగా పార్టీలో చేరినా అభ్యంతరాలు అట్లనే వుంటాయి.

అయితే ఇక ఎమ్మెల్యేల పదవీ కాలం ఒకటిన్నరేళ్లే కాబట్టి పిసి సమ్మతిస్తే స్పీకర్ సైతం తమ చేరికను ఆమోదించే అవకాశం వుంది కాబట్టి, ఎవరైనా కోర్టుకు వెళ్లినా ఆ తీర్పు వచ్చేలోగా తమ పదవీ కాలం పూర్తయి పోతుంది. కాబట్టి, పార్టీలో చేరిపోవడానికి సందేహించాల్సిన అవసరం లేదని స్వతంత్రులలో కొందరు వాదిస్తున్నారు. కాని దీనికి జెకె పెద్దగా ఇష్టపడుతున్నట్లు లేదు. తాము అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ కాంగ్రెస్ వాదులమే కాబట్టి, కొత్తగా పార్టీలో చేరవలసిన అవసరం ఏముందన్నది జెకె ప్రశ్న. కాని కాంగ్రెస్‌లో అధికారికంగా చేరితే మంత్రి వర్గ విస్తరణలు, కార్పొరేషన్ల పదవుల పంపకంలో వరుసలో నిలవడానికి అర్హత లభిస్తుంది. తనకు ఎమ్మెల్యే పదవే చాలునని, ఆ పైన వాటి మీద ఆసక్తి లేదని, వాటి కోసం చట్టాన్ని అతిక్రమించా నన్పించుకోవడం తన కిష్టం లేదని జెకె చెప్తున్నాడు. స్వతంత్రుడిగా కూడా ఆయన ముఖ్యమంత్రితో మంచి చనువే సంపాదించుకున్నాడు. పనులు గట్రా బాగా చక్కబెట్టుకో గల్గుతున్నాడు. తదుపరి ఎన్నికల్లో కాంగ్రెస్ టికెట్ అడగడానికి ఆనాటికి పార్టీలో లేకపోవడం అనర్హతగా పరిణమిస్తుందా అన్న సందేహం ఒకటుంది. కాని జె.కె. కాంగ్రెస్ అభిమానంలో, పార్టీకి సేవ చేయడంలో ఎవరికీ తీసిపోడు. ఆసాకుతో వెనక్కు నెట్టే ప్రయత్నం చేయాలే గాని, అదొక కారణంగా మాత్రం వుండదు. అప్పటి పరిస్థితులెట్లా వుంటాయో, ఇప్పుడే వూహించడ మెందుకు?

* * *

**పివి పచ్చ జెండా వూపినా ఫిరాయింపు చట్టం రెడ్ సిగ్నల్ అడ్డు తొలగదు!**

## ఆనం క్షమాపణకు హామి?

జిల్లాలో కాంగ్రెస్ పార్టీని భ్రష్టు పట్టించి, జిల్లా రాజకీయాన్ని జుగుప్సాకరం చేస్తున్న ఆనం, మాగుంట వివాదానికి తెర దించడానికి శ్రీ జనార్దన రెడ్డి కృషి ప్రారంభించినట్లు కన్పడుతూంది. ఈ వివాదం ప్రారంభమైనప్పటి నుంచి జనార్దన రెడ్డి గారు ఉభయులతో సంబంధాలు నెలకొల్పు కుంటూ తటస్థంగా వుంటున్నారు. ఇద్దరి తోనూ మాట్లాడుతున్నారు. ఇద్దర్నీ సమంగానే చూస్తున్నారు. ఆ చనువుతో ఆయన ఇప్పుడు ఉభయుల మధ్య రాజీకి యత్నిస్తున్నట్లు తెలుస్తూంది. ఆ దృష్టితోనే కాబోలు – ఢిల్లీలో తన పైన, తన అనుచరుల పైన ఫిర్యాదు చేసినారని తెలిసినా గుంభనంగా వుండిపోయారు.

**జనార్దన రాజీమంత్రం పారుతుందా? మాగుంట కారెక్కడమే సంజీవ రెడ్డి సర్దుబాటుకు సంకేతమా?**

మాగుంట సుబ్బరామ రెడ్డిని విమర్శిస్తూ పత్రికలో ప్రకటన చేసిన దాని పై ఆనం సంజీవ రెడ్డి చేత బహిరంగ క్షమాపణ చెప్పిస్తానని జనార్దన రెడ్డి హామీ ఇచ్చినట్లు తెలుస్తూంది. నెల్లూరులో ఏదో ఒక సభ పెట్టి, దానికి తామూ హాజరై, అందులో సంజీవ రెడ్డి గారి చేత ఒక చిన్న మాటలో సారీ చెప్పిస్తానని ; ఈ సమస్యకు, ఈ సంక్షోభానికి ఇంతటితో తెరదించమని ఆయన మాగుంట వారిని కోరుతున్నారట. సంజీవ రెడ్డి గారు దీనికి సమ్మతిస్తారా? మొదట మొదట అయితే ససేమిరా అంటుండినారు. ఇప్పుడు వేడి తగ్గింది కాబట్టి 'వూ' అంటాడని భావిస్తున్నారు. జనార్దన రెడ్డి గారి నెల్లూరు పర్యటనలో, ఆయనతో బాటుగా మాగుంట సుబ్బరామ రెడ్డి గారి బెంజ్‌కారులో సంజీవ రెడ్డి గారు ప్రయాణించడం దీనికి సంకేతంగా భావించ వచ్చునా? జనార్దన రెడ్డి గారు ముఖ్యమంత్రి అయినప్పటి నుంచి, ఆయన నెల్లూరు వచ్చినప్పుడల్లా మాగుంట కార్లలోనే తిరగడం అలవాటు. జిల్లాలో ఆధునికమైన, ఖరీదైన బెంజ్ కారు వుండేది వారొక్కరికే. అందువల్ల ఆయన ఆ కారులోనే తిరుగుతుంటారు. ఇందిరాభవన్ సంఘటన తర్వాత ఆయన నెల్లూరు వచ్చినా ఆనం సంజీవ రెడ్డి గారు ఎక్కడో ఒక చోట కలిసి మాట్లాడడం తప్ప, పర్యటనలో పాలు పంచుకోలేదు. కలసి తిరగడమంటే మాగుంట వారి కారు ఎక్కాలి. డ్రైవరూ వారి ఉద్యోగే. అది తనకు తల తీసేసినట్లుందని, అందువల్లే తాను జనార్దన రెడ్డి పర్యటనలకు వెళ్లడం మానుకుంటున్నానని అందరితో చెప్పేదాయన. ఈ పర్యటనలో ఆ వ్రతాన్ని వదలి, వారి కారు ఎక్కి తిరిగారంటే రాజీకి సమ్మతించినట్లే భావించారేమో!

దీనికి తగినట్లే సంజీవ రెడ్డి గారు మాగుంట వారి పై ఫిర్యాదు చేయడానికి ఢిల్లీకి తీసుక వెళ్లిన పెద్ద నివేదికను అక్కడ ఇవ్వకుండానే తిరిగి వచ్చేశారు. నెల్లూరులో 'ఈనాడు' లీక్ చేసిన ఫిర్యాదులేవీ ఢిల్లీలో విన్పించలేదు. పైగా మాగుంట సుబ్బరామ రెడ్డి గారు కోవూరు ఎన్నికలలో కాంగ్రెస్ గెలుపుకు విశేష కృషి చేశారని కితాబు కూడా ఇచ్చాడట. ఈ ప్లేటు ఫిరాయింపు పై ఆరోకె ధావన్ ప్రశ్నల వర్షం కురిపించాడని అనధికార వార్త. సంజీవ రెడ్డి గారు తన ఫిర్యాదు పత్రాన్ని తారు మారు చేసుకోవడానికి, ఆగ్రహంతో వెళ్లిన వాడు, చల్లబడిపోయి సుబ్బరామ రెడ్డిని ప్రశంసించి రావడానికి జనార్దన రెడ్డి రాజీమంత్రోప దేశమే కారణమై వుండవచ్చునన్నది వూహ.

క్షమాపణ చెబితే.. దిసిసి అధ్యక్షుడిగా తొలగించాలనే తమ పట్టుదల సడలిస్తామని మాగుంట వారు హామీ ఇచ్చినట్లు వార్త. సుబ్బరామ రెడ్డి మనసు గాయపడిందే పత్రికా

కొరవ 6వ పేజీలో

# చీకటి నరకపు 'ఇరకం'లో కాంతి రేఖలు!

ముట్టావిడు... మధ్యలో జానెంత పెద్ద మట్టిదిబ్బ ప్రపంచానికి దానికి సంబంధం లేదు; అభివృద్ధికి అస్కారమూలేదు. ఎటు చూసినా నీళ్ళ- కాని గొంతు తడుపుకోవడానికి చుక్కనీరు దొరకదు. రాత్రయితే కటిక చీకటి. కన్నుపొడుచుకున్నా కన్పించని గాఢాంధకారంపు గాలికి రెపరెపలాడే కిరోసిన్ దీపాలే వారికి ఆధారం. పొద్దుగుంకితే పురుగు, పుట్ర భయం. వంటైనా, వార్పయినా, ఆకైనా, పాకైనా వెల్తురున్నప్పుడే! అక్కడికి పత్రికలు రావు. పాఠశాలలు నడవవు. ఆసుపత్రులుండవు. డాక్టర్లుండరు. మందులు దొరకవు. నాయకులు రారు. అధికార్లు కన్పించరు. కార్లు బస్సులెట్లావుంటాయో తెలియదు. రైలుకూత విన్పడదు. పారిశ్రామిక యంత్రాల రొద విన్పించదు. సినిమాలు లేవు. సిగరెట్టుగరు కనీసం చల్లటి సోడా కూడా దొరకదు. — ఈ ఆధునిక సమాజంలో అదొక రాతి యుగపు ప్రదేశం. ఆ దీవి పేరు ఇరకం. దాని పేరులోనే నరకంలోని ముప్పాతిక భాగం ఇమిడ్చి వుంది. అక్కడి జీవితమంతా దుర్భరం. ఆధునిక శాస్త్ర పరిజ్ఞానానికి ప్రతీక అయిన శ్రీహరికోట అక్కడకు కూతవేటు దూరంలో వుంది; కాని 'ఇరకం' మాత్రం విజ్ఞాన శాస్త్ర ప్రపంచానికి వెయ్యి క్రోసుల దూరంలో జీవిస్తున్నది.

**ఆ దీవిలో మనుషులెట్లా జీవిస్తున్నారా అని ఆశ్చర్యమేస్తుంది!**

ఎప్పుడో మూడువందల ఏళ్లక్రితం ఒక మొదలియార్ కుటుంబం తమిళనాడు నుంచి బ్రతికే జాగా కోసం అన్వేషిస్తూ పులికాట్ ఉప్పునీటిలోని ఈ దీవిలో కాలు పెట్టిందట. కొలంబస్ అమెరికాను కనిపెట్టినట్లు వంటిది సంఘటన. ఈ మూడు వందలేళ్లలో ఆ మొదలియార్ కుటుంబం శాఖోప శాఖలుగా విస్తరించింది. వారి దగ్గర పనిపాటలు చేయడానికి వచ్చి స్థిరపడిన హరిజన కుటుంబాలు మరికొన్ని వున్నాయి. రెండున్నర వేల జనాభాకు ఇటుకలతో కట్టిన ఇల్లు ఒక్కటి సర్పంచిది. తక్కినవన్నీ పూరిపాకలు.

ఎవరికీ చదువురాదు. విద్యావంతుల సంఖ్య వేళ్లమీద లెక్క పెట్ట గలిగినంత! పేరుకు పాఠశాల వుందిగాని, ఏ అయ్యవారు పడవెక్కి వచ్చి చదువు చెప్తారు? జీతాల లెక్కకే టీచర్లు; అక్షరాస్యత పట్ల వారికి ఆసక్తి లేదు. చదివి ఏమి చేయాలి? సముద్రంలో తెరచాప పడవెక్కి తిరగడానికి మన చదువులుపకరిస్తాయా? కనీసం దినపత్రిక చదువుకొనే అవకాశమూ లేదు. జ్వరం కాసినా, జబ్బుచేసినా, ఆకు పసర్లు, కషాయాలే మార్గాంతరాలు. చిన్న ఆస్పత్రి భవనం కట్టారు. - డాక్టరువచ్చి చేయలేదు. ప్రాణం మీదకొస్తే, పడవెక్కించి, మూడు గంటలు ప్రయాణించి, తడకు చేరవేయాలి. అప్పటి వరకు బ్రతికి వుంటారు? యమకింకరులకు కేసుల సంఖ్య తగ్గినప్పుడల్లా ఇరకం వచ్చి, చిత్రగుప్తుడి చిట్టాను భర్తీ చేస్తుంటారు.

ఇరకంలో సెంటు పొలం వ్యవసాయ యోగ్యం కాదు. ఎక్కడ చూసినా మొగలి పువ్వు పొదలు, కొంత జెముడు చెట్లు. నీళ్లుంటె కదా - పంటలు పండించేది? త్రాగే నీళ్లకైనా సరే- ప్రక్క దీవికి పోవాల్సిందే. రోజూ నీళ్లలో పడవలో వెళ్లి, నీళ్లు తెచ్చుకోవలసి రావడం ఎటువంటి ప్రకృతి వైచిత్రం? అందరి జీవనాధారం -చేపల వేట; అదీ నాటు పడవలో! మరపడవ ఒక్కటి కూడా లేదు. చేపలు పట్టడం ఒక ఎత్తయితే వాటిని తడ వరకు చేర్చి, అమ్ముకోవడం ఇంకొక ఎత్తు. ఆడదారా చేరేలోగా చేపలు, రొయ్యలు చెడిపోవడం చాలా మామూలు.

ఇంతటి దుర్భరమైన, దుస్తరమైన జీవితం గడుపుతున్న 'ఇరకం' దీవిలో తొలి సారిగా వెలుగు రేఖలు ప్రసరింప జేశారు మంత్రి శ్రీ పసల పెంచలయ్య. సూళ్లూరు పేట ఎమ్మెల్యేగా ఎన్నికైనప్పుడు ఆ దీవి వాసులకు వాగ్దానం చేశారట- విద్యుత్ దీపాలు వెలిగిస్తానని. అదేమి చిన్న పనా? నీళ్లలో వైర్లెట్లా నడుస్తాయి? పులికాట్ ఎండే సరస్సుకాదు- శ్రీహరికోట దీవి నుంచి ఐదు కిలోమీటర్ల దూరం నీళ్లలో పెద్ద పెద్ద

కొరవ 10వ పేజీలో



## జిల్లా వార్తలు

### కోవూరు చెరువు పూడిపోతే కాటకమే!

కోవూరు చెరువును అన్యాక్రాంతం కాకుండా కాపాడమని, ఆ గ్రామ సర్పంచ్ శ్రీ ఎ. సుందరరామ రెడ్డి, ఉపసర్పంచ్ శ్రీ కె. చంద్రమోహన్ రెడ్డి, కలెక్టర్ గారిని మరీ మరీ కోరుతున్నారు. కోవూరు, పడుగుపాడుల ఆయకట్టుకు ఈ చెరువే ఆధారం. మంచినీళ్లకూ అదే దిక్కు. రక్షిత నీటి పథకాలూ అక్కడి నుంచే నడుస్తున్నాయి. ఈ చెరువు పూడిపోయినా, సాగుకిచ్చేసి ఎండి బెట్టినా ఆయకట్టు రైతులు అల్లాడి పోతారు. చెరువులో నీళ్లు లేకుంటే మంచి నీటి బావులు ఎండి పోతాయి. రెండు గ్రామాల ప్రజలూ కాటకం చవి చూడాల్సి వస్తుంది.

ఈ చెరువు లోతట్టులో వున్న రైతులకు, ఆయకట్టు రైతులకు మధ్య చాలా కాలం నుంచి నీటి నిల్వ పైన తగువుంది. లోతట్టు రైతులు ఇప్పుడు చెరువు నాక్రమించుకునే ప్రమాదం ఏర్పడడమే చంద్రమోహన రెడ్డి, సుందర రామరెడ్డి గారల భయాందోళనకు కారణం. చెరువులో పూడిక తీయించి నీటి నిల్వ సామర్థ్యం పెంచాలని, అన్ని తూముల నుండి నీరు పారించాలని, కలుజ పై భాగంలోని బంజరు భూమిని మాత్రమే పేదలకు పంచాలని, వెల్లువ నివారించడానికి కలుజను నిర్మించాలని వారు కోరుతున్నారు.

### దగ్గవోలు అప్పుల గగ్గోలు

గూడూరు తాలూకా దగ్గవోలు కో ఆపరేటివ్ సొసైటీలో రైతుల కిచ్చిన అప్పులను అకాలంలో కట్టమని ప్రాణం తీస్తున్నారని గగ్గోలుగా వుంది. వీరికి అప్పులిచ్చిందే ఫిబ్రవరిలో! నాలుగు

కొరవ 6 పేజీలో

# జమీన్‌రైతు

## పొగాకు రైతుల గోడు

పొగాకు రైతులు మరొకసారి అన్యాయమై పోయారు. వ్యాపారుల మాయాజాలంలో చిక్కి, చిక్కి శల్యమై పోతున్నారు. ప్రతి వ్యవసాయోత్పత్తి అమ్మకాలలోనూ రైతుకు నష్టం, వ్యాపారికి లాభం సహజమే కాని, పొగాకు వలె రైతును వ్యాపారుల ఇంద్రజాలానికి గురి చేసి, పిల్చి పిప్పి చేసే పంట మరొకటి వుండదు. ఒక సంవత్సరం బ్రహ్మాండమైన ఆదాయం, పై సంవత్సరం గుడ్లు తిరిగే నష్టం. ఎందరు రైతులు పొగాకు పుణ్యాన దివాలా తీశారో, ఎందరు రైతులు ఆత్మహత్యలకు పాల్పడారో చెప్పలేము. అయినా రైతు ఆ మోజు వీడలేకున్నారు. చేసిన పొరపాట్లే మళ్లీ మళ్లీ చేస్తున్నారు.

గత సంవత్సరం ఒక్క కిలో పొగాకు రు. 34 లు అమ్మింది; రైతు నాలుగు కాసులు కళ్ల జూచారు. అంతే, అందరూ దానికే ఎగబడ్డారు. ఒక్కసారిగా ధర కిలో రు 17 లకు దిగజారి పోయింది. ఆ రేటుకు అమ్మితే పెట్టిన ఖర్చులు కూడా రావు. అప్పులు అట్నే మిగిలి పోతాయి. రష్యా నుంచి ఆర్డర్లు సక్రమంగా రాకపోవడం, వద్దన్నా వినకుండా రైతులు అధిక విస్తీర్ణంలో పొగాకు పండించడం ఈ దుస్థితికి కారణమని ప్రభుత్వం చెప్తున్నది. పొగాకు బోర్డు తన నిస్సహాయతను వ్యక్తం చేస్తున్నది. 3 కోట్ల కిలోలు ఎక్కువగా పండించారని అంచనా అట. అది నిజమే కావచ్చు, కాని, ధర లిట్లా పడి పోవడానికి కేవలం అధికోత్పత్తే కారణం కాదు. పొగాకు వ్యాపారుల అక్రమార్జనా సంకల్పం ఇందులో ఇమిడి వుంది. రైతులను దోచుకొని, వారి రక్తమాంసాలతో బ్యాలెన్స్ షీట్‌లో లాభాలు పెంచుకొనే తత్వం పొగాకు వ్యాపారులది. ఐటిసి వంటి బడా కంపెనీ నుంచి, గుంటూరు కుబేరుల వరకు ప్రతి ఒక్కరూ రైతు మాంసాన్ని ఆరగించి ఆస్తులు పెంచుకున్నవారే. రష్యా ఆర్డర్లు రాని మాట నిజం కాదు. కొద్దిగా తగ్గినా పుష్కలంగానే వచ్చాయి. డాలర్లలో రేటూ దండిగానే వుంది. కేవలం రైతు బలహీనతను గమనించి ఈ దారుణ మాయకు పాల్పడుతున్నారు వారు. స్వదేశీ మార్కెట్‌లోనూ సిగిరెట్లకు గిరాకీ తగ్గలేదు. ఒక్క కంపెనీ కూడా రేటు తగ్గించలేదు. కిలో రు. 17 లు లెక్కన కొంటే వారి లాభాలు రెట్టింపౌతాయి. ఆ దుర్బుద్ధే ఈ దారుణానికి కారణం.

రైతు ఇంత దీనంగా వ్యాపారుల వలలో చిక్కి విలవిల లాడడం అన్యాయం. ప్రభుత్వం వారిని రక్షించడానికి చేయదగిన ప్రయత్నం చేయడం లేదు. రైతు అధికోత్పత్తి చేసింది నిజమే; కాని అది మహా పరాధమా? ప్రపంచ మార్కెట్‌లో ఒక్కసారిగా పొగాకు ఉత్పత్తులు పడిపోయాయనడం వ్యాపారులు కల్పించిన కట్టుకథే. ప్రభుత్వమే ఏదో ఒక రూపంలో రైతును ఆదుకోవాలి. మరొక సారి వారు అప్పుల పాలై ఆత్మహత్యలకు పాల్పడే దీనస్థితి ఏర్పడకుండా చూడాలి.

## పంచాయితీలు

పంచాయితీల పట్ల రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యం ప్రదర్శించడం పట్ల ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు చిరాకు పడ్డారు. ఎన్నికలు జరిపించ నందుకు ఆగ్రహం వ్యక్తం చేశారు. పంచాయితీల పై అప్పుడప్పుడు అమాయకులకు ఇటువంటి ప్రేమ పుట్టుక రావడం మామూలే. కాని జరిగేది మాత్రం పూజ్యం. రాజీవ్ గాంధీ ఒక్కడే చిత్తశుద్ధితో ప్రయత్నం చేసి గ్రామ పంచాయితీలకు రాజ్యాంగ ప్రతిపత్తి కల్పించడానికి ప్రయత్నించారు. కాని ఆయన ఆశయం ఇంకాఅమలులోకి రాలేదు. కాంగ్రెస్ ప్రభుత్వాలే దాన్ని ఆచరించలేదు. పశ్చిమ బెంగాల్‌లో సిపిఎం ప్రభుత్వం మాత్రం క్రమం తప్పకుండా పంచాయితీలకు ఎన్నికలు జరుపుతున్నది; వాటికి స్వయం పాలనాధి కారాలిచ్చి గ్రామాలలో ప్రజాస్వామ్య వ్యవస్థను పరిపూర్ణం చేస్తున్నది.

మన రాష్ట్రం వరకు తీసుకున్నా అధికారంలో వుండే నాయకుల ఇష్టా ఇష్టాల పై అధారపడి ఎన్నికల నిర్ణయం జరగడం వల్ల పంచాయితీలు క్రమ పద్ధతిలో ఎన్నికలకు నోచుకోలేక పోతున్నాయి. ఎన్టీఆర్ వంటి నాయకులు పెత్తనానికి వచ్చినప్పుడు రాజకీయ దురుద్దేశ్యాలతో నిధులు నిలిపి వేసి, అధికారులకు పెత్తనం అప్పగించి పంచాయితీలను నిర్వీర్యం చేస్తున్నారు. రాష్ట్రంలో రాజకీయాధికారం మారినప్పుడల్లా పంచాయితీల తలరాత మారిపోతున్నది. ముఖ్యమంత్రి అభీష్టానుసారం వాటి స్వరూపం మారిపోతున్నది. అందువల్లే ప్రజలలో క్రమంగా వాటి పట్ల ఆసక్తి, వాటి అవసరం పట్ల అవగాహన లోపిస్తున్నాయి. ఎన్నికలు [illegible] వేయడానికి ప్రతి ముఖ్యమంత్రి చెప్పే కారణం – వాటి వల్ల గ్రామాలలో [illegible]లు చెలరేగి హింసాయుత వాతావరణం ఏర్పడుతుందనడం. అది [illegible]కు నిజమే. కాని గ్రామ స్వరాజ్య సంకల్పానికి తరుణోపాయమైన స్థానిక సంస్థలను ఆ ఒక్క కారణంతో నిర్వీర్యం చేసేయడం న్యాయం కాదు.

రాజీవ్ గాంధీ కలలు కన్న తీరులో పంచాయితీలను రూపొందించడానికి పివి ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. పంచాయితీల రాజ్యాంగ ప్రతిపత్తి కార్యక్రమాన్ని మరింత వేగిర పరచి, ప్రతి రాష్ట్ర ప్రభుత్వం నిర్ణీత కాలంలో విధిగా ఎన్నికలు జరిపించేటట్లు, వాటికి నిధులు, విధుల విషయంలో మాటి మాటికీ మార్పులు చేయకుండా, వాటి స్వయం ప్రతిపత్తి చెడకుండా రాజ్యాంగంలో రక్షణ కల్పించే టట్లు చూడాలి.

---

# జమీన్‌రైతు

9.7.1943

4 పేజీలు. 0-1-6

### రాళ్లపాడు ప్రాజెక్టు నిర్మించాలి

నెల్లూరు జిల్లా జమీన్‌రైతు సంఘ కార్యదర్శి మహానంద చౌదరి కందుకూరు తాలూకా జమీన్‌రైతు గ్రామాల్లో 25, 26, 27, 28 తేదీలు సంచారము చేసి ఇలా ప్రకటించుతున్నారు.

ఈ ప్రాంతాల జమీన్ గ్రామాదుల్లో నీటి వసతుల సదుపాయాలు, యితర సదుపాయాలు లేక ప్రజలు నానా బాధలు పడుతున్నారు. చెర్వులు అబందర స్థితిలో వున్నందున సాగు చేయుటకు వీలు లేక పోతోంది.

మన్నేరు నదికి రాళ్లపాడు వద్ద ప్రాజెక్టు ఏర్పాటు చేసిన దాదాపు 60 గ్రామాల్లో సాగై లక్షలాది యకరాలకు నీటి వసతి కల్గును. అధికారులు యిది వరలో 18 లక్షలకు ఎస్టిమేటు చేసి శాంక్షను నిమిత్తం పంపారట. ఎన్నో సంవత్సరాల నుండి దీనికై ఆందోళన సాగుచున్నది. వెంటనే ప్రభుత్వం యీ పనికి పూనుకొన్న బీదలకు కూలి పనులు దొరకుటే గాక అధిక ఆహారోత్పత్తికెంతో సదుపాయం కల్గును. రెండవది చుండి పెద్ద చెర్వు తెగి యిప్పటికి 17 సంవత్సరాలైనా జమీందారు గాని, ప్రభుత్వం గాని మరమ్మతుకు పూనుకోలేదు.. ఈ చెర్వు 6, 7 గ్రామాలకు సంబంధించినది. ఇది సాగు చేస్తె 7, 8 వేల యకరాలు సాగవుతుంది. లింగ సముద్రం చెర్వుకు దాదాపు 10, 15 వేలు ఖర్చు పెట్టి మరమ్మతు చేస్తె రెండు వేల యకరాలకు జాస్తి సాగు అవుతుంది. ఇలాంటి నీటి వసతులెన్నో అబందర స్థితిలో వుండి తలమానికమై బడలేదు. యిది వరలో యుద్ధానికి పూర్వమే యీ ప్రాంతాల ప్రజలు అవసరమైనంత తిండి దొరకనందున కళాయి పనులు, బట్టల వ్యాపారము, కూలీలుగా మద్రాసు, గోదావరి ప్రాంతాలకు వెళ్లి యుండిరి. కాన వెంటనే యిలాటి ప్రాజెక్టులు నిర్మించి అధికాహారోత్పత్తికి తోడ్పడుట ప్రభుత్వ విధి అని హెచ్చరించు చున్నాము.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### నాటకాల పిచ్చి

పల్లెల్లో నాటకాల పిచ్చి ప్రబలి పోయింది. మేనేజింగ్ కమిటీ అనే పేరుతో ఒక కంట్రాక్టు బృందం బైలుదేరడము, సావిత్రో, హరిశ్చంద్రో యేదోఒకటి వేయడము, టిక్కెట్లు బాధించి అమ్మడం, చివరకు నాటకం రుచించక పోవడము, కంట్రాక్టుదార్లకు నెత్తి అణగడము జరుగుతున్నది.

సాధ్యశ్యాలు కావాలంటె బోలెడు. ఇందుకూరు పేట చింతామణిలో పాతిక వెయ్యి వెయి తగిలింది. ఉచ్చి నాటకాల్లో ఉద్యోగ విజయం – శివాజీలో రు. 450 ల లోలాభం. చివరకు బస్ స్టాండులో కాఫీ హోటలు సుబ్బిశెట్టి గూడా దమయంతి [illegible]కంలో రు. 400 లు [illegible]కున్నారు. 25,600 కాఫీ కప్పులలో సంపాయించిన కాలణా లాభాలు ఒక్కనాడు సమర్పించి కూర్చొన్నారు. ఇట్లే చాలా చోట్ల జరుగుతున్నట్లు వార్తలొస్తున్నవి. కావున ధనాశతో కిరాయి నటకులను తెచ్చి నష్ట పడకుందురని హెచ్చరిస్తున్నాము.

#### రేబాల లత్సయ్య ధర్మాలు

నెల్లూరులో స్వర్గీయ రేబాల లత్సయ్య ధర్మాలు చాలా ఉన్నవి. ముఖ్యమైన వాటిలో ఒకటి అమెరికన్ ఆసుపత్రి వద్ద కట్టిన కొట్లు. దీని మేనేజిమెంటు అంతా ఆసుపత్రి వారికే వప్పగించారు. వారు బాడుగలు తట్టుకుంటున్నారనే గాని దాని రిపేరు గాని, ఇంప్రూమెంటు గాని ఏమి తలపెట్టడం లేదు. అందులో రెండు కొళాయిలుంటే అవి పని చేయడం లేదు. అక్కడున్న వారు నీటికి బడు ప్రయాస వర్ణనాతీతం. చివరకొక బావి గూడా లేదు ఆవరణంలో. మహారాజా ఆ పోలయ్య తప్పితే మరొకరు దాన్ని చూచిన పాపాన బోరు. దాని పాలకులు ముందు ఆ నీటి విషయమై తగు శ్రద్ధ వహింతురు గాక.

అట్లే టవున్‌లో వున్న ధర్మ కొళాయిలు గూడా మూత బడినవి.

రేబాల సోదరులు యివి గమనించ కోరిక.

కొరవ 10 పేజీలో

---

# డిగ్రీలు రద్దు చేస్తే విద్యా ప్రమాణాలు పెరిగి పోతాయా?

గతవారం వుస్మానియా యూనివర్శిటీ ప్లాటినమ్ జూబిలీ వుత్సవాల్లో ప్రధాని పి.వి. నరసింహా రావు చేసిన ప్రసంగం విద్యావంతుల్ని మేధావుల్ని ఆలోచింప చేయక మానదు. విద్యా ప్రమాణాలు క్షీణించి పోతున్నాయని డిగ్రీలు రద్దు చేయాలని తేల్చి చెప్పారాయన. కాని డిగ్రీలు రద్దు చేసినంత మాత్రాన విద్యా ప్రమాణాలు ఆకాశానికి ఎదిగి పోతాయా?

ఎనిమిదేళ్ల క్రితం పి.వి. మానవ వనరుల మంత్రిగా వున్నప్పుడు నూతన జాతీయ విద్యావిధానాన్ని రచించి ప్రవేశ పెట్టి తరువాత అది విఫలమైందని అంగీకరించారు. ఆ సభలోనే సాంకేతిక విద్యా పరిజ్ఞానం పారిశ్రామికాభి వృద్ధికి అనుగుణంగా లేదని చేసిన వాఖ్య కూడా ఏ మాత్రం సమంజసం కాదు. బోధనాంశాలను ఖండ ఖండాలుగా విభజించి ఇంజనీరింగ్ విద్యా విధానంలో బోధిస్తున్న విషయం మేధావిగా ఆయనకు తెలిసే వుంటుంది. యూనివర్శిటీల్లో శాంతి లేక పోవడానికి రాజకీయ పార్టీలే కారణం. విద్యను ముగించిన తరువాత ప్రభుత్వం కల్పిస్తున్న సౌకర్యాలు ఏమిటనేది చెప్పలేదు. విద్యను వ్యాపారంగా చేసిన ఘాతన విద్యా వ్యవస్థను ముందు సంస్కరించి ఈ విధంగా మాట్లాడి వుంటేబాగుండేది.

నెల్లూరు –ఐ.వి. రఘురామమూర్తి

### గుమ్మడి కాయల దొంగ

గుమ్మడి కాయల దొంగ ఎవరంటే భుజాలు తముడు కున్నట్లు – మతతత్వ శక్తులను రాజకీయాల నుండి వేరు చేయాలన్నప్పుడల్లా

## జనవాణి

బి.జె.పి. ఉలికి పడుతుంటుంది. మతాన్ని రాజకీయాల్లోకి వుపయోగించి అధికార పీఠాలు అధిష్టించాలను కోవడం అతి హేయమైన విషయం. ఇటీవల అటువంటి శక్తులు మరీ పెట్రేగి పోతున్నాయి. ప్రజాస్వామ్య వ్యవస్థకు వూపిరిగా మనం వ్రాసుకొన్న రాజ్యాంగంలో మతపర వ్యవస్థకు స్థానమే లేదు. కాని ఈ అంశాన్ని గట్టిగా నొక్కి అమలు పరిచేలా లౌకిక వాద సిద్ధాంతాల పై నడిచే పార్టీలు కొత్త చట్టాలను తీసుకో రావల్సిన అవసరం ఎంతైనా వుంది. లేకుంటే మరో స్వాతంత్ర్య పోరాటం తప్పదు.

నెల్లూరు –కె. చంద్రమోహన్

### ఆలోచింప చేసిన వ్యాసం

జూన్ 25 తేది సంచికలో వి.వి. నర్సిలం రుజావు కావాలని వ్రాసిన వ్యాసం ప్రతి ఒక్కరూ చదివి

కొరవ 10 పేజీలో

పోగత్తలు లేవు, పూలమాలలు లేవు, మైకులు లేవు, మెహర్బాని చేష్టలూ లేవు—
వూరూరు తొంగి చూచాడు, మనిషి మనిషితో మాట్లాడాడు, ప్రతి ఒక్కరి సమస్యా సావధానంగా విన్నాడు!

# కొత్త బాణీలో జనార్దన రెడ్డి చైత్రయాత్ర!

మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డిని అమాయకుడైన రాజకీయ పిరికివాడిగా ఎవరిలో వున్నా, లేకున్నా అక్కడ జనాన్ని తన చుట్టూ తిప్పుకోవడం చిల్లో ఆయనకు తెలియనంతగా మరే రాజకీయ వాదికి తెలిసి వుండదు. ముఖ్యమంత్రిత్వం పరిత్యజించి పదవులు కావిస్తున్నా ఆ దాబు దర్పం ఏమాత్రం తగ్గకుండా, మాసిపోకుండా జనానికి తనానికి తేడా తెలియకుండా గడిపేయ గల్గుతున్నారు.

అదే పైలట్, అదే ఎస్కార్ట్, అదే పోలీసు బందోబస్తు, అదే బెంజికారు, అదే కార్లకాన్వాయ్, అదే స్పీడు... అచ్చు గుద్దినట్లు అనాటి ముఖ్యమంత్రిత్వపు దాబు ఇప్పుడూ వుంది. అప్పుడూ ఇప్పుడూ గెస్ట్‌హౌసనిండా జనమే! చిట్టి ఎమ్మెల్యేలు, పోగితే ఎమ్మెల్యేలు కూడా కారు దిగేటప్పటికి రెంచన్‌గా హాజరై

దొరాడు. ఆయనలోని ఆకర్షణ మహత్యం అది. ఈ ఆర్భాటం జనార్దనరెడ్డికి సామాన్య జనానికి మధ్య ఎప్పుడూ ఒక అనుబంధ తెరను దించేస్తుంటుంది. దగ్గరకు రాలేని అడ్డుగా నిలుస్తుంటుంది. పదవిలో వున్నప్పుడు ఆ తెరతీసే ప్రయత్నం జనార్దనరెడ్డిగారు చేయలేదు; ఆ అవసరమూ కల్గలేదు. కాని రాజకీయ భవిష్యత్తుకు అడ్డుగోడలు, అర్థం కట్టి

తెరలు అటంకాలని గ్రహింపుకు రావడంతో తనంతట తానుగా జనం మధ్యకు వచ్చే ప్రయత్నం చేస్తున్నారాయన. దాని ఫలితమే 3 నుంచి 5 తేది వరకు జరిగిన వెంకటగిరి పర్యటన. అది పర్యటన కాదు- చైత్రయాత్ర, జన చైతన్య యాత్ర.

జనార్దనరెడ్డి మీద రాజకీయ ద్వేషాన్ని అనేరా తీసుకొని డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి వెంకటగిరిలో కలకలం సృష్టిస్తున్నారు. ఆయన తండ్రి శ్రీ రాజారెడ్డికి నెల్లూరు జిల్లాలో మైనవుంది. దాని దగ్గరకు విచ్చేటప్పుడు, వెళ్లేటప్పుడు వెంకటగిరిలో ఆగి, జనార్దనరెడ్డి గారిపై నాలుగు రాళ్లు వేసి పోవడం ఆనవాయితీగా కలవాటు. అది దుష్ప్రచారమనంది, విష ప్రచారమనంది- వైఎస్ కుటుంబీకుల రాళ్ల కోకలు వెంకటగిరిలో జనార్దనరెడ్డి ప్రాభవానికి మసిపూస్తున్నాయి. స్థానిక నాయకులకు దాన్ని తుడిచే శక్తిలేదు. సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ కూడాసఫలీకృతురాలు కాలేక పోయారు. ఆమె ఎంత ఒద్దికగా పనులు చేసి పెట్టినా, ఓపికగా తిరిగినా, ఓర్పుతో, కన్పడిన వారందరినీ పలుకరించినా, ఉదారంగా వాగ్దానాలు చేసినా ప్రజలలో అభిమానం ఏర్పడలేదు; పార్టీబలం పెరగలేదు. ఈ పరిస్థితి గమనించే జనార్దనరెడ్డి గారు తన ఓటర్లతో తనకు తానుగా ప్రత్యక్ష సంబంధం పెట్టుకొనే కృషి ప్రారంభించారు. మామూలు దరబదలు, ఆర్భాటాలతో గ్రామాలకు వెళ్తే జనం తన దగ్గరకు రారని, రాలేరని భావించి- మాజీ ముఖ్యమంత్రి స్థాయి వదలి, సాధారణ ఎమ్మెల్యే మాదిరి పర్యటించారు జనార్దనరెడ్డి గారు ఏ వూరిలోనూ సభలు లేవు- రచ్చబండ సమావేశాలు తప్ప; పోగత్తలు లేవు- సమస్యలు వినడం తప్ప; మైకులు లేవు- ముఖాముఖి సంభాషణలు తప్ప; పెట్లు, తప్పెట్లు వంటి మెహర్బాని చేష్టలసలే లేవు- చర్చలు, అర్జీల స్వీకారాలు తప్ప.

ఐదు రోజుల పాటు వూరూరు తిరిగాడు; పల్లెపల్లె వెళ్లాడు; మనిషి మనిషితో మాట్లాడాడు; వారు చెప్పే సమస్యలు సావధానంగా విన్నాడు; కలెక్టరాది అధికార్లు ప్రక్కనే వుండడంతో చాలా సమస్యలకు అక్కడికక్కడే పరిష్కారాలు చూపించేవారు. కోపం, చిరాకు, విసుగు కన్పించనివ్వలేదు. చెప్పిందే చెప్పినా, విన్నదే వినాల్సి వచ్చినా, సందర్భంలేని సమస్యలతో జనం విసిగించినా ఓర్పుగా విన్నారు; నవ్వుచెప్పే ధోరణిలో మాట్లాడారు.

ఉదయం ఆరు నుంచి రాత్రి 10 గంటలవరకు కూడా కొనసాగాయి ఈ యాత్రలు. కారు పోలేని కొండక్రింది పల్లెలకు జీపులో వెళ్లారు. నక్సలైట్ల బెడద వుండడంతో ఆ అడవులలో చెట్టుపుట్టలకు కూడా పోలీసు బందోబస్తు చేయాల్సి వచ్చింది. ఇంతకాలం తన చేత స్థానిక నాయకులు ఈ గ్రామాలకు రోడ్లు వేయించక పోవడం పట్ల జనార్దనరెడ్డి చిరుకోపం ప్రదర్శించారు. అయితే ఆయన వస్తున్నాడని అధికారులు అప్పటి కప్పుడు కొన్ని గ్రామాలలో మంచినీటి బోర్లువేసి, గ్రామస్తుల దప్పిక తీర్చారు.

ప్రతి గ్రామంలో రచ్చబండపైన అరగంట, గంటా కూర్చుని ఓపికగా చెప్పింది విని, సమాధానం చెప్పిన జనార్దనరెడ్డిని చూసి, జనం ఆశ్చర్యపోయారను కొంది! ఈ ఓర్పు, నేర్పు ఎప్పుడూ ప్రదర్శిస్తే జనమెందుకు పిల్చినా పలకనంత దూరం పారిపోతారు? మధ్యాహ్నం భోజనం, నిద్రకూడా వీధిలోనే. రచ్చబండ మీద తిని, చెట్టుక్రింద మంచం వేయించుకొని గాఢంగా నిద్రపోయాడు యాతలూరులో!

సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ పర్యటన ఆసాంతం ప్రక్కనే వుండినారు! కలెక్టరు, జాయింట్ కలెక్టర్, వివిధ ప్రభుత్వ శాఖల అధికార్లు వెంట తిరిగారు. స్థానిక నాయకులను మాత్రం పెద్దగా రానివ్వలేదు.

ఆడవాళ్ల శాపనార్థాలు నిర్వాహకులకు విన్పడలేదా?

# రొట్టెల పండుగలో చెప్పనలవికాని పాట్లు!

అన్ని శాఖల అధికారులు కలసి కట్టుగా వ్యవహరించి నెల్లూరు పరువును నడి చెరువులోని బురదలో కూరేశారు. రాష్ట్రం నలుమూలల నుంచే గాక ఇతర రాష్ట్రాల నుంచి కూడా భక్తిభావంతో రొట్టెల పండుగకు వచ్చిన జనం ఎందుకొచ్చామా అని తమలోతాము కుమిలిపోయేలా చేసారు. కోరిన కోర్కెలు నిదానంగా తీరవచ్చునేమో గాని నెల్లూరు ఊరికి చెరువులో వెంగు మునిగిన మగువల చీరలు పెట్రోల్ వాష్ చేస్తే గాని ఆ పాడు గబ్బు వదలదు. రొట్టెల పండుగ కోసం పది కుంటల నీళ్లను నీటి పారుదల శాఖాధికారులు చెరువుకు వదల లేక పోయారు. నాచుతో పాచి పట్టిన నీళ్లు, అడుగు పెడితే మోకాలు లోతు బురదలో కూరుక పోతూ లక్షలాది మహిళలు పెట్టిన శాపనార్థాలు ఏ అధికారికి తగిలినట్లు లేదు! అయితే బురద కడుక్కోను మాత్రం అక్కడక్కడా మునిసిపాలిటీ కొళాయిలు వేసి తమ బాధ్యత తీర్చుకొన్నది. మాగుంట వారి నీటి వ్యాన్లు ఎడతెరపి లేకుండా తిరిగినా, ఒక చుట్టు తిప్పిన సోడా సీసా రెండు రూపాయిలకు అమ్మినా, నాలుక పిడుచ గట్టుక పోయిన ప్రజల దాహం తీరలేదు. అడుగు తీసి అడుగు

కొరవ 9 పేజీలో

అవి దోమలు కావు బాబోయ్, రక్తం పీల్చే దెయ్యాలు!

# ప్రతి రాత్రీ శివరాత్రే!

నెల్లూరు టౌన్‌లో దోమల బాధ అటు కాకుండా పెరిగిపోయింది. రాత్రయితే చాలు- ఇంట్లోవున్నా, వీధిలోవున్నా, ఫ్యాన్లు తిరుగుతున్నా, జెట్లు పనిచేస్తూనే వున్నా, నిద్రపోతున్నా, మేలుకొని వున్నా వదలకుండా పట్టి పీకుతున్నాయి; మూడున్నర లక్షల జనాభాలో రోజుకు ఒక పొడుపు నుంచి అరవై పక్షం పది మిల్లీలీటర్ల రక్తం జుర్రుకుంటున్నాయని లెక్కగట్టినా, ప్రతిరాత్రి దాదాపు 35 లీటర్ల మానవ రక్తం ఈ జుర్రి దెయ్యాలకు తర్పణమై పోతున్నది. నిజంగానే అవి దోమలు కావు, రక్తం పీల్చే దెయ్యాలు. ఏసిలుండే పుణ్యాత్ములకు తప్ప, సాదా

సింహపురి

మనుషులకు నిద్రవుంటే ఒట్టు. ప్రతిరాత్రీ శివరాత్రి జాగరణగానే వుంది.

ఎవరితో చెప్పుకుంటే తీరే బాధ ఇది? మునిసిపాలిటీ చెవుల్లో సీసం పోసుకొని వుంది; పైగా దానివి ఎప్పుడూ గుడ్డి కళ్లే, చూడలేదు, వినలేదు. ఏ మాత్రం చూడ గల్గినా వీధుల్లో పేరుక పోతున్న చెత్త, మురుగు గుంటలు కన్పడవా? వారికి చెప్పడం దండుగ. కలెక్టర్ గారైనా శ్రద్ధ చూపి, ఏదో ఒక మార్గం వెతికితే తప్ప పౌరులు నెల్లూరులో బ్రతక లేరు; చీకటిపడితే సరిక్ ఇరుగు పొరుగు పల్లెలకు వలస పోవలసి వస్తుంది!

కొరవ 9 పేజీలో

# సణుగుడు

* స్వర్ణముఖి బ్రిడ్జి కట్టిన కాంట్రాక్టర్ కంటే దాన్ని కట్టించిన అధికార్లను శిక్షించాలి.!

* కాటా పేరుతో దోపిడీ ఆపే వారు లేరా?

స్వర్ణముఖి బ్రిడ్జి కూలి పోయింది. వంగడం, వాలడం, క్రుంగడం, పగుళ్లివ్వడం కాదు. ఏకంగా కూలి పోయింది; వెదురు పుల్లలతో కట్టిన వంతెన మాదిరి విరిగి పోయింది. ఒక లారీ బ్రిడ్జి మీదుగా ప్రయాణించ బోయిందట - సగం దూరం వచ్చేసరికి వంతెన కోసం వేసిన శ్లాబులు కాస్త ఒకటొకటిగా కదలి పోయాయట; లారీ డ్రైవరు భయపడి బ్రేక్ వేశాడు; అంతే, ఆ కదలికతో లారీ చక్రాల కిందున్న రెండు శ్లాబ్‌లు అట్టే వాలి, నదిలోని ఇసుకను తాకి నిల్చిపోయాయి. ఆ ఏటవాలులో లారీ చిక్కుక పోయింది. ఆ డ్రైవరుకు భూమి మీద నూకలు మిగిలి వుండినాయి కాబట్టి సరిపోయింది కాని, లేకుంటే పరి మనాల్సింది. శ్లాబ్‌లు నిదానంగా నేలవాలడం కాకుండా, విసురుగా విరిగి పడి వుంటే ఎంతటి ప్రమాదం జరిగి వుండేదో వూహించలేము. అంతకు కొద్ది నిమిషాలకి క్రితమే ఒక టౌన్ బస్ బ్రిడ్జి పైన వెళ్లిందట. అదే గనుక ఇట్లా పడి వుంటే ఎందరి ప్రాణాలు హరించుకొని పోయి వుండేవి? ఆ సీను చూస్తుంటే - సిమెంటు, ఇనుము, కంకర వాడి కట్టిన బ్రిడ్జిగా కన్పడడం లేదు; ఏ సినిమా వాడో అట్టలతో వేసిన సెట్టింగ్ మాదిరి వుంది. సినిమా సెట్టింగ్ అయినా అంత బలహీనంగా వుంటుందంటే నమ్మలేము. ఆ బ్రిడ్జి కట్టిన తర్వాత దానిపైన వాహనాలు నడపడం ఇదే ప్రథమం. ఐదారేళ్ల క్రితమే పూర్తి అయినా - కాంట్రాక్టరు బిల్లు కూడా తీసుకోక ముందే, ఒకటి రెండు దిమ్మెలు క్రుంగాయి; అప్పుడు డిజైన్ లోపం అన్నారు. తిరిగి కట్టడానికి టెండర్లు పిల్చారు. అయితే దిమ్మెల లోపం అన్నది కాస్త ఇప్పుడు మాత్రే వాటిపైన వేసిన శ్లాబ్ కూడా బలహీనంగా వుందని తేలిపోయింది. అంటే నిర్మాణంలోనే లోపం. అంతా ఇంతా బలం తక్కువ కాదు - అట్టల బొమ్మకున్నంత బలంతో మాత్రమే

డోలేంద్ర

వున్నదని రుజువై పోయింది.

ఐదు కోట్లు ఖర్చు పెట్టి కట్టిన ఒక బ్రిడ్జి పది టన్నుల లారీ బరువుకే క్రుంగి పోయిందంటే, విరిగి పోయిందంటే ఏమి చేయాలి? ఖచ్చితంగా కాంట్రాక్టరునే నిందించాలి; వీధిలో నిలేసి అడగాలి. కాని తప్పు కాంట్రాక్టరు ఒక్కడిదేనా? కానే కాదు. కాంట్రాక్టర్ అనే వర్గం డబ్బు సంపాదనకే పుట్టింది. డబ్బు కక్కుర్తి వారి సహజ లక్షణం. అందుకోసం ఏ గడ్డైనా కరవడం వారి వ్యాపార విజయ రహస్యం. సందు దొరికితే దోచుకొని తినడానికి కాంట్రాక్టరన్న ప్రతి వాడూ కాచుకొని వుంటాడు. సిమెంటులో ఇసుక కల్పడానికైనా, ఇసుకలో సిమెంట్ కల్పడానికైనా వారు రెడీ! అసలు పని చేయకుండానే బిల్లు లిస్తామంటే వారి

కొరవ 8 వ పేజీలో

## నెల్లూరు నుంచ్ఛేస్తే
## విదూషకుడు

### జనార్దన రెడ్డి కాలువలు చూశారు!

మాజీముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి 7 తేది ఉదయం పక్కల కాలువ, పైనేరు కాలువల రిపేరు పనులు సందర్శించారు. ఇవి రెండూ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయన మంజూరు చేయించిన మరమ్మత్తులు.

వెంకటగిరి క్షేత్రయాత్ర ఇచ్చిన ఉత్సాహంతో ఇతర నియోజక వర్గాలలోనూ అదే తీరున దవ్వబంద సమావేశాలు నిర్వహించాలని తలపెట్టినారు. బహుశా 20 తేది ప్రాంతంలో నర్వేపల్లితో ఈ పర్యటన మొదలౌతుంది.

### దత్తాత్రేయ

బిజెపి రాష్ట్ర ఉపాధ్యక్షుడు సికింద్రాబాద్ పార్లమెంట్ సభ్యుడు శ్రీ దత్తాత్రేయ 6 తేది నెల్లూరు వచ్చారు. రంగనాయకుల పేటలో కార్యకర్తల సమావేశం జరిగింది. కోవూరులో 'కాశ్మీర్ బచావో' ర్యాలీలో పాల్గొన్నారు.

### ఉద్యోగస్తులతో సారాయి ర్యాలీ

కలెక్టర్ శ్రీ సాంబశివ రావు గారు సారాయి వుద్యమంలో సంపూర్ణంగా నిమగ్నమై పోయారు. గవర్నర్‌తో రెండు రోజుల సహచర్యం ఆయనలో ఉద్యమ స్ఫూర్తిని రగిలించి నట్లుంది. ఏ గ్రామానికి వెళ్లినా, ఏ సభలో మాట్లాడినా సారాయి ప్రస్తావనే! త్రాగుడు మానని గ్రామాలలో అభివృద్ధి కార్యక్రమాలు నిలిపేస్తామని హెచ్చరిస్తున్నారు. రెవిన్యూ ఉద్యోగులందరూ ఉద్యమంలో చురుకుగా పాల్గొనాలని హుకుం జారీ చేశారు.

8 తేది మధ్యాహ్నం జిల్లాలోని వివిధ ప్రభుత్వ శాఖల ఉద్యోగులందరినీ కలిపి టౌన్‌లో ఊరేగింపు నిర్వహించారు. అన్ని ప్రభుత్వ ప్రైవేటు స్కూళ్ల తమ పిల్లలతో చిన్న చిన్న ప్రదర్శనలు నిర్వహించాలని పురమాయించారు. మొత్తం మీద సారాయి ఉద్యమంలో సంఘ సేవకులకంటే సర్కారు ఉత్సాహమే ఎక్కువగా వుంది. ఇది ఫలించి త్రాగుడు కనీసం 10 శాతం తగ్గినా నెల్లూరు పేరు ప్రపంచ వ్యాప్తంగా మార్మోగుతుంది; ప్రజలూ బాగుపడతారు.

### ఇల్లు అమ్మబడును

నెల్లూరు టౌన్ బాలాజీనగర్ నెల్లూరు నగర్ సీలు ఫ్యాక్టరీ దగ్గర డోర్ నెం. 27/II/1555 గల 46 అంకణాల స్థలం అందులోని 16 అంకణాల కట్టుబడి గల ఇల్లు అమ్మబడును. వివరాలకు పి. దేవకుమార్ రెడ్డిని ఇంట్లో సంప్రదించండి.





### స్వాతంత్ర్యయోధుడు మోచర్ల కన్నుమూత

సూళ్లూరుపేట పాత కాంగ్రెస్ వాది, సతత ఖద్దరు దారి, స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ మోచర్ల హనుమంత



రావు 2 తేది రాత్రి కోట పోలూరులోని స్వంత ఇంట్లో చనిపోయారు. ఆయన వయస్సు 87 సంవత్సరాలు.

1921 లోనే కాంగ్రెస్‌లో చేరిన దేశభక్తుడాయన. అప్పుడాయన వయస్సు కేవలం పదిహేనేళ్లు. అనాటి నుంచి ఆజన్మాంతం కాంగ్రెస్‌ను వీడలేదు. 1941 లో కోట పోలూరులో వ్యష్టి సత్యాగ్రహం చేశారు; కాని అరెస్ట్ కాలేదు. ఒకసారి సూళ్లూరుపేట నుంచి రాజమండ్రి వరకు నడిచి వెళ్లి సత్యాగ్రహ ప్రచారం చేశారు. తిరిగి 1942 లో మరొకసారి సత్యాగ్రహం చేసి అరెస్ట్ అయ్యి, ఒకటిన్నర సంవత్సరం జైలు శిక్ష అనుభవించారు. స్వాతంత్ర్యం తర్వాత పదవీ రాజకీయాలలో ప్రవేశించకుండా స్వగ్రామంలోనే అజ్ఞాతంగా గడిపేసిన త్యాగ పురుషుడు, ధన్యజీవి; వారి కుటుంబానికి మా సానుభూతి.

### చిట్వేలిలో ఎన్‌కౌంటర్ నక్సలైట్ల మృతి

నెల్లూరు జిల్లా సుహద్దులకు సమీపంలో, కడప జిల్లా చిట్వేలి మండలం కూటలమర్రి గ్రామంలో 4 తేది నక్సలైట్లకు, పోలీసుకు మధ్య ఎన్‌కౌంటర్ జరిగింది. ఇదొక కుగ్రామం. చుట్టూ దట్టమైన అడవి. రాకపోకలకు కూడా వసతి లేని అధ్వాన్న పరిస్థితి. పెంచలకోన దళం సభ్యులు ఆ గ్రామాలలోనూ తమ కార్యకలాపాలు ప్రారంభించారు. హోంమంత్రి శ్రీ మైసూరా రెడ్డి బంధువు అయిన కొండారెడ్డి అనే వ్యక్తి స్థానికంగా కూలీలను దబాయించి, రౌడీ మామూలు దండుతుంటాడట. అతడిని లక్ష్యంగా పెట్టుకొని కూలీలను ఐక్యపరచడం మొదలు పెట్టారు. పోలీసులు ఒక కన్నేసి వుంచి, 4 తేది ఉదయం నక్సలైట్లు పెద్ద యానాదయ్య అనే గిరిజనుడి ఇంట్లో మకాం పెట్టి వున్నారని కనిపెట్టి, దాడి చేశారట. లోపల ఐదుగురు వుండినారు. ఇద్దరి మధ్య కాల్పులు జరిగాయని, ముగ్గురు మరణించగా, ఇద్దరు పారిపోయారని పోలీసుల కథనం. చనిపోయిన వారు – కొమర ఆనంద్ అలియాస్ శేఖర్ (నెల్లూరు టౌన్) జయరాం అలియాస్ రమణ (ప్రకాశం జిల్లా) మాల్యాద్రి అలియాస్ రవి (దగదర్తి) వీరందరూ పెంచలకోన దళం సభ్యులు; పీపుల్స్ వార్ గణపతి విభాగానికి చెందిన వారు. సారా ఉద్యమంలో కూడా చురుకుగా పాల్గొన్నారు. శేఖర్ సోదరుడు పౌరహక్కుల సంఘం నాయకుడట. తప్పించుకున్న ఇద్దరి కోసం పోలీసు వెతుకుతున్నది.

జరిగింది కడప జిల్లాలోనే అయినా ఈ ఎన్‌కౌంటర్ ప్రభావం నెల్లూరు పైనే ఎక్కువ. అందువల్లే పోలీసు అప్రమత్తంగా వ్యవహరిస్తున్నది. నక్సలైట్లకూ ఇది పెద్ద షాక్. తిరిగి బలం సమకూర్చుకునే వరకు తమ కార్యకలాపాలు తాత్కాలికంగా నిలపాలన్న ఆలోచనలో వున్నారట వారు.



నెల్లూరు లయన్స్ క్లబ్ నూతన కార్యవర్గ ప్రమాణ స్వీకారోత్సవంలో – మాజీ గవర్నర్ సి.హెచ్. సత్యనారాయణ, కొత్త అధ్యక్షుడు ఎస్.ఎస్.వి. రామమోహన్, మాజీ అధ్యక్షుడు పి. ప్రభాకర్, కార్యదర్శి డాక్టర్ జి. జయచంద్ర

### జిల్లా కాంగ్రెస్ మద్య నిషేధం

నెల్లూరు జిల్లాలో ఉధృతంగా కొనసాగుతున్న మద్య నిషేధం కార్యక్రమాలలో ఇక నుంచి చురుకుగా పాల్గొనాలని జిల్లా కాంగ్రెస్ నిర్ణయించింది. 8 తేది డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి, జనార్దన రెడ్డి, వేమారెడ్డి రామచంద్రా రెడ్డి తదితర నాయకులు సమావేశమై ఈ నిర్ణయం తీసుకున్నారు. జూలై 21 తేది నుంచి అన్ని మండల కేంద్రాలలో ర్యాలీలు నిర్వహిస్తారు. ఈ కార్యక్రమం నిరంతరాయంగా జరుగుతుంది. దొంగసారా నిరోధం, కావుడు సారా బట్టీల నివారణకు కూడా కాంగ్రెస్ కార్యకర్తలు పని చేయాలని సంజీవ రెడ్డి

కొరవ 6 పేజీలో

### ఆత్మకూరు డి.ము.కోర్టులో

O.S. No. 62/92

పొట్లేటి హజరత్‌రావు —వాది

గ్రామపంచాయితీ సీతారామపురం రెప్రజెంటెడ్ బై ఎక్స్ ఎగ్జిక్యూటివ్ అధారిటి. ప్రెసిడెంట్ సర్పంచ్, శ్రీ పాలగిరి చిన అల్లూరు రాజు —ప్రతివాది

### దావా నోటీసు

వాది ప్రతివాది మీద, పంచాయితీ నుండి, తనకు రావలసిన బాకీని వసూలు చేసికొనుటకై దావా చేసియున్నందున సదరు దావా నోటీసు ప్రతివాదికి జారీ కాగలందులకై 15.7.93 తేది వాయిదా వేయబడి వున్నది. ఆ రోజు ఉ. 10.30 గంటలకు కోర్టులో ప్రతివాది హాజరై ఆక్షేపణలున్న యెడల తెలుపుకొనేది. లేని యెడల ఎక్సుపార్టీగా తీర్మానించబడును.

**C. CHENCHAIAH**
Advocate for Plaintiff

### నెల్లూరు IIIఅడిషనల్ డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులో

O.S.No.453/92

వాది. M/S. SHIVAPRIYA FINANCIERS, NELLORE REPRESENTED BY PARTNERS P. MALAKONDA REDDY

VS

ప్రతివాది. 1. M/S. SURYA WINES, NELLORE

TO,1. M/S. SURYA WINES, NELLORE REPRESENTED BY PROPRIETOR SHAIK WAHI DUNNISA 2. SHAIK JANI, No.12 MUNCIPAL COMPLEX, SUBEDARPETA, NELLORE.

### నోటీసు

పై నెంబరున వాది దావా పరిహారము రాబట్టుకొను నిమిత్తం దావా చేసియున్నందున మీకు గల ఆక్షేపణలను 21-7-93తేది పగలు 10గంటలకు పై కోర్టుకు హాజరై తెలుపుకోవలెనని. లేని యెడల ఏకపక్షముగ తీర్మానించబడును.

**S.V. Sarma**
Advocate for Petitioner



వెంకటగిరి నియోజక వర్గంలోని ఒక గ్రామంలో రచ్చబండ పై నిలబడి మహిళలతో ముచ్చటిస్తున్న మాజీ ముఖ్యమంత్రి ఎన్. జనార్దన రెడ్డి; ప్రతి గ్రామంలోనూ ఆయన పర్యటన దృశ్యాలు ఇవే

## సంజీవరెడ్డి

మొదటి పేజీ తరువాయి

ప్రకటనతో; దానికి పశ్చాత్తాపం వ్యక్తం చేస్తే క్షమించి వదిలేయడానికి ఆయనకు అభ్యంతరం ఏముంటుంది?

ఇది కాకుండా, ఆనం కుటుంబంలోని యువసోదరులిద్దరితో విడిగా సంధి చేసుకొనే ప్రయత్నం మరొకటి జరిగిందని తెలుస్తున్నది. పై స్థాయిలో జరిగే రాజీ యత్నంలో వారికి ప్రమేయం వున్నట్లు లేదు. తగువు పెద్దాయనతో తప్ప, పిల్ల కాయలతో కాదు కాబట్టి, వారితో పూర్వపు స్నేహ సంబంధాలు పాటించడం సహృదయత అన్పించుకుంటుందని మాగుంట వర్గీయులు భావించినట్లున్నారు. ఈ ఆలోచన మంచిదే కాని, అది ఆనం సోదరులకు చేరక ముందే మధ్యలో ఎవరో మెలిక పెట్టి, వారు దాన్ని తిరస్కరించారన్న తప్పుడు వార్తను చేరవేశారట. తమ దగ్గరకు ఎవరూ ఏ ప్రతిపాదనతోనూ రాలేదని ఆనం వారంటారు; తాము చెప్పి పంపితే పసేమిరా కాదన్నారని వారంటున్నారు. ఇరువురి కలయిక ఇష్టపడని వారెవరో ఇరువురి మధ్య సమాచారాన్ని హైజాక్ చేసినట్లున్నారు. ఇందిరాభవన్ దుర్ఘటన తర్వాత మాటలు మార్చి చేరవేయడం చాలా మామూలై పోయి వుంది.

ఈ రాజీ ఇటుండగానే, మాగుంట వారు జిల్లా ఎమ్మెల్యేలను కలిసి తమ అభిప్రాయాలు విన్పించే కార్యక్రమం కొనసాగిస్తున్నారు. అయితే వారికే తమ యుద్ధం ఎవరితో అన్న విషయంలో ఇంకా ఒక స్పష్టమైన అవగాహన వచ్చినట్లు లేదు. దాన్ని ఆనం వారికి పరిమితం చేయల్నా, ఇంకా పైకి తీసుక వెళ్లాల్నా అన్న విషయంలో ఒక నిర్ణయానికి రాలేకున్నారు. ఇప్పటి వరకు వారు చేస్తున్నది గాలితో యుద్ధమే!

విధిస్తున్నారట. ఇది అన్యాయం కాదా అన్నది రైతుల ఆవేదన.

వేమారెడ్డికి విన్పించారా మీ బాధ? గూడూరు రైతులంటే ఆయనకు స్పెషల్ ప్రేమ; చెప్పుకోండి. న్యాయం చేస్తాడు.

## పెద్దల్లుడు

మొదటి పేజీ తరువాయి

చంద్రబాబు నాయుడ్ని దూరంగా పెట్టారట. 'దేశం' ఆస్థానంలో ఇప్పుడంతా పెద్దల్లుడి మాటే చెల్లుబాటవుతోంది. దీంతో పచ్చ చొక్కాలన్నీ ఇప్పుడు డాక్టర్ వెంకటేశ్వర రావు నివాసం ముందు పడిగాపులు కాస్తున్నాయి.

## నెల్లూరు ముచ్చట్లు

5 పేజీ తరువాయి

గారు పిలుపిచ్చారు. ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి ప్రారంభించిన "సంపూర్ణ" మద్య నిషేధం లక్ష్యంగా దీనిని పని చేస్తుందని, ముఖ్యమంత్రికి పూర్తి మద్దతు ప్రకటించి ఉద్యమానికి విస్తృత ప్రచారం ఇవ్వాలని నిర్ణయించామని సంజీవ రెడ్డిగారు ప్రకటించారు.

తెలుగుదేశం తరపున చంద్రమోహన్ రెడ్డి తొలి నుంచి సారాయి ఉద్యమంలో నిమగ్నమై పార్టీని ప్రజలలోకి తీసుక వెళ్లారు. తెలుగుదేశం ఈ రోజు జిల్లాలో బ్రతికి వుందంటే అది సారా ఉద్యమం ఫలితమే. రెండేళ్ల పాటు నిద్రపోయిన కాంగ్రెస్‌కు ఇప్పుడైనా మత్తు వదలినందుకు సంతోషిద్దాం!

## జిల్లావార్తలు

2 పేజీ తరువాయి

నెలలు కూడా కాలేదు. అప్పుడే కట్టమంటే ఎట్లా? పంట చేతికి రాక ముందే, రైతుకు దబ్బెక్కడి నుంచి వస్తుంది! పైగా చేతికి చెక్కు ఇచ్చిన తేది నాటి నుంచి కాక, కాగితాల మీద అప్పు మంజూరైన తేది నుంచి వడ్డీ

## ఘోరమైన ప్రమాదం — డాక్టర్ మరణం

నెల్లూరులో 8 తేది ఉదయం జరిగిన ఘోరమైన రోడ్డు ప్రమాదంలో డాక్టర్ కూనం మాలకొండా రెడ్డి అనే యువకుడు మరణించారు. దర్గామిట్ట, టిటిడి కళ్యాణ మండపం దగ్గర, ఎల్‌ఐసి ఆఫీసుకు ఎదురుగా జరిగింది దుర్ఘటన. డాక్టర్ మాలకొండా రెడ్డి తనిటిక హోండా స్కూటర్‌లో వెళ్తుండినారు. పినాకినీ గ్రామీణ బ్యాంకుకు చెందిన జీపు ఒకటి ఎదురుగా వస్తూ అతడ్ని తొక్కేసింది. వెంటనే ఆస్పత్రికి తరలించారు గాని, ఫలితం లేకుండా పోయింది. అత్యంత విషాదకరమైన దృశ్యం అది. మాలకొండా రెడ్డి భార్య శ్రీమతి సరస్వతి కూడా డాక్టరే. ఆమె డిఎం అండ్ హెచ్ ఒ ఆఫీసులో పని చేస్తున్నది.

## ప్రెస్ క్లబ్ ప్రారంభం

నెల్లూరు జర్నలిస్టు లందరూ కలసి చాలా కాలం తర్వాత ఒక మంచి పని చేశారు. ప్రెస్ క్లబ్ స్థాపించి, తమ కంటూ ఒక చిరునామా ఏర్పర్చుకున్నారు. ట్రంకురోడ్డు, నెల్లూరు ఫార్మసీ ఎదరు సందులో బాడుగింట్లో ప్రారంభమైన ప్రెస్ క్లబ్‌ను 5 తేది మంత్రి శ్రీ పనబాక పెంచలయ్య ప్రారంభించారు.

జోనల్‌లో ఎవరు ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టినా ప్రెస్ క్లబ్‌లోనే జరిపించాలని నిర్ణయం! మంచి ఆలోచన ఇది. ఇతరుల ఆఫీసులు, ఇళ్లలో ప్రెస్ కాన్ఫరెన్స్‌లంటే ఒక్కొక్కసారి విలేఖర్లకు ప్రాణం వచ్చిపోతున్నది. ఉదయం రిపోర్టరు వెంకట సుబ్బయ్య పట్టుదలగా పనిచేసి క్లబ్ స్థాపించారు. అందరూ కలసి సమైక్యంగా నిర్వహించుకో గలిగితే జర్నలిస్టులు పరువుగా బ్రతక గల్గుతారు.

### డిఐజి బదలీ

నెల్లూరు డిఐజి శ్రీ శ్రీరామమూర్తిని హైదరాబాదుకు బదలీ చేశారు. ఆయన స్థానంలో ఇంకా ఎవర్నీ నియమించలేదు. శ్రీరామమూర్తి గారు వివాద రహితుడు.


రౌడీ రాజకీయం చిత్రంలో భానుచందర్, జయసుధ

# మడికట్టుకున్న సినిమాలు చూసే వారు ఎవరు?

జూన్ 1నుంచి అమల్యం. అశ్లీలం, స్త్రీ_లను కించపరిచే దృశ్యాలు,మితిమించిన హింసాత్మక సన్నివేశాలున్న చిత్రాలకు సర్టిఫికెట్ ఇవ్వబోమని ప్రభుత్వ ప్రకటన వెలువరించింది.

"ఇదెలా సాధ్యం? మడి కట్టుకున్న చిత్రాలను ఎవరు చూస్తారు?".

"ఈ సర్టిఫికెట్ స్ఫూర్తితో ఎవరూ మన రాష్ట్రంలో సినిమాలు తీయడం లేదు. ప్రభుత్వం ప్రోత్సహించే వినోద పన్ను రాయితీల మూలంగానే మన రాష్ట్రంలో తయారయ్యే చిత్రాల సంఖ్య పెరిగింది. విజయశాంత ముఖ్యపాత్రకే కోటి అడుగుతోందని తెలిసి మీనా, రోజా వంటి తారలు 20లక్షలకు రేట్లు పెంచేశారు. అంత మొత్తానికి సిద్ధపడే నిర్మాతలకు ప్రభుత్వం ఇస్తూవచ్చిన మూడు లక్షలు ఏ మూలకు ?".

"ఇలాంటి ప్రభుత్వ ఉత్తర్వు వెజిటేరియన్ చిత్ర నిర్మాణానికి దోహదం చేస్తుందా?"

"ఈ సర్టిఫికెట్‌తోపాటు వినోదపు పన్ను రాయితీలను కూడా తీసేయమనండి. మానవా మన రథంబును మరలనిమ్ము, చలో మద్రాస్ అంటూ మూటా ముల్లే సర్దుకుని తాపీగా వెళ్ళిని చిత్రాలు నిర్మించడంపై దృష్టినిలుపుతాం. భూమి గుండ్రంగా ఉంది కదా?"

ఇలా రకరకాల వ్యాఖ్యలు వినిపిస్తున్నాయి. అసలు వినోదపు పన్ను చెల్లింపుల్లోనే ఎన్నో అవకతవకలు జరుగుతున్నాయన్న విషయం ఎల్లెడలా వినిపిస్తోంది. ప్రభుత్వం ఈ విషయమై ఎలాంటి నిర్ణయం తీసుకోనున్నదో?

# ఆరేళ్ల తర్వాత తెలుగులో మాధవి!

అమితాబచ్చన్ సిఫారసులతో మాధవికి కొన్ని హిందీ చిత్రాలలో అవకాశాలు వచ్చేసరికి బొంబాయికి మకాం మార్చేసింది. ఇప్పుడు అమితాబ్‌కే చిత్రాలు లేవు. అందేత మాధవి తన స్వస్థలం హైదరాబాద్‌కు చేరుకుంది. "నేను పుట్టి పెరిగిన హైదరాబాద్‌లో నా మాతృభాషలో ఒక చిత్రాన్ని (దొంగ మొగుడు- తర్వాత) చేస్తున్నందుకు ఎంతో ఆనందంగా ఉంది." అందామె. ఆ చిత్రం "మాతృదేవోభవ" : ఇందులో అమెతోపాటు తమిళనటులు నాజర్, చారుహాసన్, బ్రహ్మానందం, తనికెళ్ల భరణి, బాబూమోహన్ నటిస్తున్నారు గెస్టులుగా మురళీమోహన్, అల్లురామలింగయ్య, నిర్మలమ్మ, సుధ పాల్గొంటారట. మాటలు: సత్యమూర్తి, సంగీతం: ఎం.ఎం. కీరవాణి, దర్శకత్వం: కె.అజయ్‌కుమార్, నిర్మాత: కె.ఎస్. రామారావు.

## మద్రాసు సినిమా వార్తలు

### ఏ భాషలలో ఎన్నెన్ని ?

మన దేశంలో చలన చిత్రాల నిర్మాణం ప్రారంభమైన లగాయితు 60ఏళ్ళల్లో తెలుగులో 3,683, తమిళంలో 4,096, మలయాళంలో 2,311, కన్నడంలో 1,522, హిందీలో 785 చిత్రాలు దక్షిణ భారతంలో తయారయ్యాయి. ఏ భాషలోనైనా ఇప్పటి చిత్రాల కన్నా అలనాటి చిత్రాలే మణిపూసలు అన్నది అందరూ అంగీకరించే సత్యం.

### శ్రీదేవితో జయప్రద పోటీ

"హిందీ సినిమా రంగంలో శ్రీదేవి నెంబర్ 1కాదు. ఆ స్థానం నాదే." అని కొంతకాలం క్రితం జయప్రద ప్రతి పాత్రికేయుని ఎదుటాగొంతు చించుకుంటూండేది. తనకు హిందీ చిత్రాలు లేకపోయినా భరవాలేదుగాని శ్రీదేవికి ఇటీవల హిందీ చిత్రాలు తగ్గేసరికి ఆమె తృప్తిగా ఊపిరి పీల్చుకో సాగింది. కొంతకాలం క్రితం శ్రీదేవి అమృతసర్‌కు వెళ్లినప్పుడు పంజాబ్‌లో ఉగ్రవాదాన్ని సమర్థవంతంగా అణచివేసిన పంజాబ్ పోలీస్ డైరెక్టర్ జనరల్ కె.పి.ఎస్. గిల్ ఆమెను తన గృహానికి ఆహ్వానించి గొప్ప విందు ఇచ్చాడని పత్రికల ద్వారా తెలుసుకున్నప్పట్నుండి జయప్రదలో టెన్షన్ మర్రి పెరిగింది. ఇటీవల అమృతసర్‌లో 'స్టార్ నైట్'లో పాల్గొనడానికి వెళ్లిన జయప్రద నృత్యాన్ని చూసిన గిల్ తన్మయత్వంతో తానూ స్టేజిమీదకి వెళ్లి భాంగ్రాడాన్స్ చేశాడట. మర్నాటి ఉదయం తన ఇంటికి ఆహ్వానించి అల్పాహార విందు ఇచ్చాడట. శ్రీదేవి కన్నా తాను ఏ మాత్రం లిసిపోనని జయప్రద తనలో తాను సంబరపడిందట. సినిమా తారలపై ఇలా ఉన్నతాధికారులకే అంత మోజు ఉన్నప్పుడు ఇక సామాన్యులను గురించి చెప్పడమెందుకూ?

### లక్ష్మి మీద జోక్

ఒకప్పుడు నటి లక్ష్మి -నెహ్రూ కుటుంబాన్ని, ఇందిరాగాంధీని, రాజీవ్ గాంధీని ఎంతగానో మెచ్చుకునేది. ఇటీవల తాను భారతీయ జనతా పార్టీలో చేరడానికి కారణాలను ఒక తమిళ పత్రికకు చెప్తూ, "నేను చాలా కాలంక్రితం అద్వానీ చేతులమీదుగా ఒక అవార్డును అందుకుంటు స్పష్టంగా ఆయన నీతి నియమంగల ఒక మహావ్యక్తిగా నాకు అనిపించారు.

కొరవ 9 వ పేజిలో

# చిటికెల పందిరి

## వాణిజ్య చట్రంలో బిగించిన ఆర్ట్ ఫిలిం

సంపాదన స్వల్పం సంతానం అధికమై మధ్య తరగతి కుటుంబాల వారు అనుభవిస్తున్న వేదనలకు ప్రతి బింబమే చిటికెల పందిరి చిత్రం. వాస్తవాలను యధాతథంగా చూపితే అది ఆర్ట్ ఫిల్మ్ అవుతుంది. ఆ ఛాయలు పడకుండా దర్శకుడు సుదర్శన్ దట్టావార్య కష్టాలను కూడా కడుపుబ్బ నవ్వుతూ చూస్తూ ప్రేక్షకుడు ఆలోచనలో పడే విధంగా చిత్రాన్ని తీసారు. హాస్య ప్రధాన నటించేందుకు సృష్టించిన సన్నివేశాలు బాగున్నాయి. తిరుపతి వెంకటేశ్వర స్వామి ప్రపంచ రాజకీయాలు మాట్లాడటం, యాదగిరి లక్ష్మి నరసింహ స్వామి తెలంగాణా యాసలో ఉపన్యాసాలు ఇవ్వడం వాస్తవానికి దూరంగా ఉన్నా కథాపరంగా ఆక్షేపించలేరు. చిన్న చిన్న పిల్లల పై చెడు సినిమాల ప్రభావానికి దర్పణంగా పిల్లవాడు తన తండ్రితో చిన్న గొంతునై దొంగాన్ని పుట్టరిస్తానడం, మరో పాప వ్రాయలేని మాటను తన సోదరితో అనడం నేటి సమాజంలోని సజీవ దృశ్యాలే. అదే విధంగా దేశంలో ప్రతి నిత్యం జరిగే సంఘటనలను పేపర్ ద్వారా తెలుసుకొని క్షోభ పడే మూగ వాడ్ని,




అది చదివే వ్యక్తి దేశంలోని ప్రజలంతా అన్నీ మూసుకొని వుంటే మూగోడివి నీకెందుకురా ఆసడం వంటి సీన్లు ప్రేక్షకులకు రోషం తెప్పిస్తాయి. ఇంటి నిండా దేవుని ఫోటోలు పెట్టుకొని పూజిస్తే కడుపు నిండదు- ప్రతి ఒక్కరూ పని చేస్తేనే ప్రగతి సాధ్యమన్న నీతిని నర్మగర్భంగా దర్శకుడు ఈ చిత్రంలో చివరికి చెప్పారు.

చేసేది చిన్న వుద్యోగమైనా ఏడుగురు పిల్లలకు తోడుగా మరదలతో కలసిన కుటుంబ నావను లాగుతుంటాడు రామారావు

కొరవ 9 వ పేజిలో




గూడూరు సి.యం.సి పార్కులో లక్షరూపాయల వ్యయంతో నిర్మించనున్న శ్రీ చెరుకూరి పట్టాభి రామరెడ్డి పిల్లల లైబ్రరీకి 1వేది సాయంత్రం శంకుస్థాపన చేస్తున్న రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి, దాత శ్రీ చెరుకూరు పట్టాభి రామరెడ్డి ,సమాచార శాఖమంత్రి శ్రీ పసల పెంచలయ్య, రోటరీ అధ్యక్షుడు శ్రీ యం. శ్రీరామమూర్తి,మైకా ఎక్స్‌పోర్టర్ మైకా ఫ్యాబ్ అధినేత శ్రీ చెరుకూరు సురేష్ రెడ్డి చిత్రంలో వున్నారు.

# శిఖారెడ్డి పద్యాలు

### ప్రధాని

అయ్యో! వో! ప్రధాని అలోచిస్తుంటావు
పగలు రెయ్యి యిదొక పెద్ద ప్రాబ్లం!
నను ప్రధాని జెయ్యి నాకియ్యి వీకొల్యు
చూడు నా ప్రతిజ్ఞ! సుగ్రీవాజ్ఞ!

### బెజవాడ గోపాలరెడ్డి

ఎంతో కాలమైంది యితమ్ము దర్శించి
కవిని నేను తమ్ము కలుసుకోని
బయట రావాలంటె బాధాకరంగుంది
హెల్తు స్పాయిలైంది ఏజిబారు!

### పేడబెల్లమొకొటె

బైస్కిలంటె కవికి బద్ధశత్రువుగాదు.
హస్తమెపుడు గాదు ఆత్మబంధు.
పేడబెల్లమొకొటె. తెదేపా గనిపిల,
రెట్టమతము కవికి రెండు వొకటె!

•

పోయిన దాన్ని గూర్చి ప్రొదస్రమానమ్ము
గెలుకుతారు దీనివలన మనకు
వచ్చేదేమి లేదు వాదోపవాదాలు
దీనికి గలాట దెబ్బలాట!

### చెన్నారెడ్డి రామసుబ్బారెడ్డి

కవికి దగ్గరోరు కడతేరిపొయ్యారు,
ఆరితేరినోరు అన్నిటిల్లో
అరపరాని ప్రేమ అర్థేండో ఈడంటె
ఎంతటోరు చివర కెటిపాలు!

# సణుగుడు

(4 పేజీ తరువ)

కంటె సంతోషించే వారుండరు. ఆ వ్యాపారంలోని నీతి అదే. ఎంత వ్యాపారమైనా, ఎంత లాభార్జన దృష్టి అయినా, ఎంత అక్రమార్జన దురాశ అయినా, ఎంత నీచ ప్రవృత్తి అయినా ఎంత దిగజారుడైనా అందులో కొంత కనీస పాటి సాంఘిక బాధ్యత, కొంతకు కొంతైనా తినేది అరగాలన్న భయం వుండవద్దా అన్న వాదం నిజమే. అయితే కాంట్రాక్టర్లటు వంటి నికృష్ణ వ్యాపార క్రీడలాడడానికి కారకులైన అధికారులది; అసలు తప్పు కాదా అన్నది నా ప్రశ్న.

వారికి ప్రభుత్వం జీతాలి స్తున్నది; అల్లిస్తున్నది; జీపులిస్తున్నది ఇంక్రిమెంట్లిస్తున్నది;

ప్రమోషన్లిస్తున్నది; అలివి మాలిన అధికారాలిస్తున్నది; అందరిపై పెత్తనానికి పంపుతున్నది; ప్రజల సొమ్ము ఆ రూపంలో తింటున్నా మన్న విశ్వాసం అధికారులలో వుండనవసరం లేదా? జీతాల పంచ భక్ష్యాల కంటె, లంచాల అమేధ్యపు అరగింపే అధికారులకు ఆనందమన్నది తెలిసిన సంగతే కాని, వారు తమ పతనానికి ఒక సరిహద్దు నిర్ణయించుకుంటె ఇటువంటి దారుణాలు జరుగుతాయా? కాంట్రాక్టరు సిమెంటు బదులు ఇసుక వాడుతుంటె ఈ ప్రబుద్ధులేమి చేస్తున్నారు? ఇనుప కమ్ముల బదులు వెదరు పుల్లలు వంచి పెడుతుంటె ఈ నీచులెక్కడ నిద్రపోతుండినారు? కాంట్రాక్టర్ విసిరిన ఎంగిలి మెతుకులు గతుకుతూ, మోచేతుల మీదుగా పారించే నీళ్ళ, సారా త్రాగుతూ, అతడి వాకిట కట్టేసిన కుక్కల వలె జోల్లు కార్చుకుంటూ నిలబడ బట్టే కదా – ఇంత ఘోరం జరిగింది? ఇసుకలో సిమెంట్ కలిపేటప్పుడే, ఇనుము బజారులో అమ్మేటప్పుడే సంబంధిత అధికారి అభ్యంతరం చెప్పి వుంటె, ఆక్షేపించి వుంటె, ఆ బ్రిడ్జి అట్లా బొమ్మరిల్లు మాదిరి విరిగి పడుతుందా?

కాంట్రాక్టర్ పై కేసు పెట్టేకంటె ముందు, కాంట్రాక్టర్‌ను నిందించే కంటె ముందు ఆ బ్రిడ్జి నిర్మాణంలో పనిచేసిన ఇంజనీర్లను పై నుంచి క్రింద వరకు తక్షణం అరెస్టు చేసి, దేశ ద్రోహం నేరం క్రింద శిక్షించడం అవసరం; వారి పేర్లు పేపర్లలో ప్రకటించి. విస్తృత ప్రచారం కల్పించి. వారిని సంఘ బహిష్కారానికి గురి చేయడం న్యాయం. సంబంధిత ఇంజనీర్లు, సిబ్బందిని ఇంక ఒక్క రోజు వారి వారి ఉద్యోగాలలో కొనసాగించినా ప్రజలకు ద్రోహం చేసినట్లే లెక్క.

జనార్ధనరెడ్డి గారు ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేసి నెల్లూరుకు రాగానే సంబంధిత చీఫ్‌ఇంజనీర్‌ను పిలిపించి ఆరునెలల్లో తిరిగి కట్టాలని ఆదేశించారు; అటువంటి ఆరునెలలు ఆరు గడిచాయి; అయినా బ్రిడ్జి పునర్నిర్మాణం ఎట్లున్నది అట్లానే వుంది. నాయకుల చిత్తశుద్ధి అధికారుల కర్తవ్యదీక్ష అట్లుంటాయి.

* * *

స్వర్ణముఖి పైన జరిగిన దోపిడి అదైతే, జరుగుతున్న దోపిడి – లారీ కాటాల మోసం. పూర్వ కాలంలో దగ్గులు, పిండారీల వంటి బందిపోట్లు దార్లు కాచి ప్రజలను దోచుకుంటుంటె, రాజులు వారితో యుద్ధాలు చేసి అణచి వేసే వారని చరిత్రలో చదివాం; ఇప్పుడు ప్రభుత్వాలే ఆ కోవ‌‌ కు చెందిన బందిపోట్లను తయారు చేసి, దోచు కోవడానికి లైసెన్సు లిచ్చి, దోపిడి నిరాఘాటంగా జరగడానికి పోలీసు మద్దతునిస్తున్నది.

బ్రిటిషోళ్లు స్వర్ణముఖి పై కట్టిన పాత బ్రిడ్జి, బలహీన పడింది కాబట్టి, దాని పైన బరువైన వాహనాలు నడిస్తే అది కూలిపోయే ప్రమాదం వుంది కాబట్టి, అది కూడా పడిపోతే ఇక మద్రాసు, నెల్లూరుల మధ్య ఏళ్ల తరబడి రాకపోకలు తీవ్రాతిపోతాయి కాబట్టి, దాని పైన 16 టన్నుల బరువును మించిన లారీలు తిరగడానికి లేదని నిషేధం విధించారు. అంత వరకు బాగానే వుంది; కాని, లారీల బరువును నిర్ణయించేందుకు బ్రిడ్జికి అటు ఇటు కాటాలు ఏర్పాటు చేసి, కాంట్రాక్టర్లకు అప్పగించారు. లారీ బరువు 16 టన్నులకు మించి వుందని సందేహం కల్గితే వీరు తూకం వేసి నిర్ధారించాలి.

ఈ సాకుతో ఆ కాంట్రాక్టరు లారీలను దారుణంగా దోచుకుంటున్నారు. సాధారణ ఛాసిస్ వుంటే ఏ లారీలోనూ 9 టన్నులకు మించి బరువు వేయకూడదని నిషేధం వుంది. 99 శాతం లారీలు ఆ నిషేధాన్ని అతిక్రమించవు. ఒక వేళ అదనపు బరువు వేసినా ఒకటి, రెండు టన్నులకు మించదు. అది, లారీ బరువు కలిపితే 16 టన్నుల లోపే వుంటుంది. పైగా లారీలో సరకు ఎత్తేటప్పుడు, దింపేటప్పుడు కాటా వేయిస్తారు. ఆ స్లిప్‌లు లారీలోనే వుంటాయి. అనుమానం వస్తే బిల్లు చూపమంటె సరి పోతుంది. కాని కాంట్రాక్టరు, బ్రిడ్జి మీద వెళ్లే ప్రతి లారీ విధిగా తన కాటాలో తూకం వేయించు కోవాలని నిర్బంధిస్తున్నారు. ఖాళీ లారీలను కూడా బలవంత పెడుతున్నారు. ఇందుకోసం వారు రోడ్డును రెండుగా చీల్చి రాళ్లు పాతేశారు. రెండవ సగానికి అడ్డంగా ఇనుప కమ్ముల చట్రం నిలబెడుతున్నారు. దాని దగ్గర ఖాకీ దుస్తులు వేసుకొని పదిమంది నిలబడతారు. ప్రతి లారీ డ్రైవరునూ దబాయించి కాటా వైపుకు మళ్ళిస్తున్నారు. లారీలు స్పీడుగా వెళ్లకుండా రోడ్డంతా త్రవ్విపారేశారు. ఆ రెండు ఫర్లాంగుల దూరం ప్రయాణం చికాకుగా వుంది.

ఏమిటీ దుర్మార్గం? పట్ట పగలు నడిరోడ్డు మీద సర్కారు రాజ ముద్రికతో దారిదోపిడి చేసే అధికారం ఆ కాంట్రాక్టర్లకు ఎవరిచ్చారు? ఇందులో అధికారులకు ఎంతెంత వాటా ముడుతున్నది? బ్రిడ్జి బలం మీద నిజంగా ఇంజనీర్లకు భయం వుంటె, వాకాడు చీలురోడ్డు దగ్గర లారీలను చెక్ చేసి, బరువెక్కువుంటె వాటిని ప్రక్క దారికి మళ్లించాలి. బ్రిడ్జి దగ్గర వరకు వచ్చిన లారీ వెనక్కు వెళ్లాలంటె ఎంత కష్టం? పెత్తనం కాంట్రాక్టరుకు అప్పగించడం వల్ల వారు సాధారణ లారీలను పీకు తింటున్నారు; బరువుంటే లారీల నుంచి దబ్బు దండి వదిలేస్తున్నారు. బరువు లేని వాటినీ పీడిస్తున్నారు. 7 తేది ఉదయం నా కళ్ల ముందు 30 టన్నుల కంటైనర్లు తీసుక వెళ్లే నాలుగు ట్రైలర్లను స్వర్ణముఖి బ్రిడ్జి పైన వదిలేశారు. వాటి మొత్తం ఒక్కొక్కటి 40 టన్నుల పై మాటె. ట్రైలర్‌కు వంద లెక్కన దండి వదిలి పెట్టారు. బ్రిడ్జి పరిరక్షణే ధ్యేయమైతే ఇంతెంత బరువు ట్రైలర్లను ఎట్లా వదలి పెడతారు? ఆ బ్రిడ్జి కూడా కూలిపోతే ట్రాఫిక్ పరిస్థితి ఏమిటి?

ప్రభుత్వాధికారులలో లంచాలు తినే దుర్బుద్ధి, అక్రమార్జన వ్యసనాలు ఇప్పుడు సర్వసాధారణమై పోయాయి. దానికి వారిని తప్పు పట్ట లేము. కాని, మరీ ఇంత పబ్లిక్‌గా జనాన్ని పీడించుక తినే పద్ధతులు కనిపెట్టి మరీ తమ నీచత్వాన్ని ప్రదర్శించే అధికారుల నేమి చేయాలి? జిల్లాలో ఇందరు ఎమ్మెల్యేలున్నారు; ఎమ్పీలున్నారు; మంత్రులు వచ్చిపోతున్నారు; సాక్షాత్తు ముఖ్యమంత్రే రెండేళ్లు వుండినారు. ఇందరి కళ్ల ముందు ఈ దోపిడి జరుగుతుంటె ఒక్కరూ అభ్యంతరం చెప్పరేమి? తమ పదవులు, తమ సంపాదనలు తప్ప ప్రజల సమస్యలతో వీరికి పనిలేదా?

# పంచాంగము

తేది 16 శుక్రవారము దక్షిణాయన పుణ్యకాలము

### జూలై తిథులు

ఆషాఢ బహుళ

| | | | | | |
|---|---|---|---|---|---|
| తే 10 | శని | షష్టి | ఉ.గ. | 10.50 | వ |
| తే 11 | ఆది | సప్తమి | ప.గ. | 12.42 | వ |
| తే 5 | సోమ | అష్టమి | ప.గ. | 2.45 | వ |
| తే 6 | మంగళ | నవమి | ప.గ. | 4.20 | వ |
| తే 7 | బుధ | దశమి | సా.గ. | 5.40 | వ |
| తే 8 | గురు | ఏకాదశి | సా.గ. | 6.30 | వ |
| తే 9 | శుక్ర | ద్వాదశి | సా.గ. | 6.52 | వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.,

### నెల్లూరులో ఎండ

| | |
|---|---|
| 4 తేది | 96.2 |
| 5 తేది | 99.3 |
| 6 తేది | 101.66 |
| 7 తేది | 93.0 |
| 8 తేది | 95.0 |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 10.7 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 1.3 అ |
| నెల్లూరు చెరువు | 10.3 అ |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (కొత్తవి) | 3,200/- |
| 9674 (కొత్తవి) | 3,700/- |
| ఐ.ఆర్. 20 | 2,800/- |
| బియ్యం (70 కేజీలు) | 520/- |
| బియ్యం 1 కేజీ | 7.50/- |
| బంగారు సవర (8 గ్రా) | 3520/- |
| వెండి (10 గ్రా) | 68/- |
| వేరు శెనగ నూనె (కిజీ) | 30/- |
| మిరప కాయలు (కిజీ) | 20/- |
| చింతపండు (కిజీ) | 23/- |
| చక్కెర (కిజీ) | 10.50/- |
| బెల్లం (కిజీ) | 16/- |
| కందిపప్పు (కిజీ) | 19/- |
| పెసర పప్పు (కిజీ) | 17/- |


**జమీన్‌రైతు**

సంవత్సర చందా రూ. 100/-
అర్ధ సంవత్సర చందా రూ. 50/-
విడిప్రతి రూ. 2/-

# సింహపురి

4 పేజీ కొరవ

### హెల్త్ బేబి షో

అనారోగ్యానికి చికిత్స చేస్తూనే ఆరోగ్యాన్ని ప్రోత్సహించాలన్న ఉద్దేశ్యంతో డాక్టర్ శ్రీధర్ పొగతోటలోని చిన్న పిల్లల ఆసుపత్రిలో జూన్ 30 తేదీ హెల్త్ బేబి షో నిర్వహించారు. 5 సంవత్సరాల లోపు పిల్లలను మూడు విభాగాలు చేసి ఈ పోటీ పెట్టారు. పిల్లల బరువు, టీకాలు వేయించిన పద్ధతి, చురుకుదనం, అందచందాలు ప్రామాణికంగా పోటీలు జరిగాయి. డాక్టర్లు జయచంద్ర, శివకుమార్, విజయలక్ష్మి న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించి ఓపిగ్గా పలువురు పిల్లలను పరిశీలించారు. సంవత్సరం లోపు పిల్లల్లో కె. భావన, ధర్మ, వెంకట్రామ్, రత్రి విజేతలయ్యారు. రెండు సంవత్సరాల లోపు పిల్లల్లో గౌతంహర్ష, మీరా చౌదరి, అలీష, వెంకట శ్యామ్; లిటిల్‌మెన్ పోటీల్లో లాస్య, అనీష్, శ్రీ దివ్య; మాస్టర్లుగా హరీష్, దిలీప్, రవితేజలను ఎంపిక చేసారు. ముఖ్య అతిథిగా వచ్చిన జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర విజేతలకు కిరీట ధారణ చేసి బహుమతులందచేశారు. తొలుత జూనియర్ డాక్టర్ అనిల స్వాగతం పలుకగా చివరన డాక్టర్ శ్రీధర్ వందనాలు చెప్పారు. ఈ స్ఫూర్తితోనైనా మిస్ నెల్లూరు పోటీలు పెడతారేమో చూడాలి!

### ప్రగతి పథంలో ఎల్.ఐ.సి. డివిజన్

నెల్లూరు నాయకుల కృషి ఫలితంగా చిత్తూరు, ప్రకాశం జిల్లాలలోని కొన్నిప్రదేశాలను కలుపుతూ గత సంవత్సరం ఏర్పాటు చేసిన నెల్లూరు ఎల్.ఐ.సి. డివిజన్ కార్యాలయం ఒక సంవత్సరంలోనే చెప్పుకో దగ్గ ప్రగతి సాధించింది. గత సంవత్సరంలో లక్షా 9వేల 885 పాలసీ దారులను చేర్పించి 335 కోట్ల 97 లక్షల 50 వేల రూపాయల వ్యాపారం చేసినట్లు డివిజనల్ సీనియర్ మేనేజర్ సి.ఎస్. మాధవరావు 7 తేది ఏర్పాటు చేసిన విలేఖర్ల సమావేశంలో వెల్లడించారు. వచ్చే సంవత్సరం 432 కోట్ల రూపాయల వ్యాపారం చేయగలమన్న ధీమాను వ్యక్తపరిచారు. అదే విధంగా గడువు ముగిసిన 23, 387 పాలసీ దార్లలో 23, 259 మందికి 16 కోట్ల రూపాయలకు పైగా చెల్లించి రికార్డు స్థాపించి నట్లు చెప్పారు. ఈ సంవత్సరం ప్రకాశం జిల్లా, గిద్దలూరుతో పాటు తిరుపతిలో కొత్త బ్రాంచీలు ఏర్పాటు చేస్తారు. ఆ పై వచ్చే సంవత్సరం కొత్త బ్రాంచీలజాబితాలో వెంకటగిరి, బుచ్చి, కనిగిరి, పొదిలి వున్నట్లు చెప్పారు. పాలసీ దారుల ఫిర్యాదుల తక్షణ పరిష్కారానికి ప్రతి సోమవారం మధ్యాహ్నం తమ ఆఫీసుల్లో బ్రాంచ్ మేనేజర్లు సిద్ధంగా వుంటారు. త్వరలో కస్టమర్స్ మీట్‌తో పాటు తమ సిబ్బందికి స్పోర్ట్స్‌మీట్ ఏర్పాటు చేస్తున్నట్లు వివరించారు.

### అపోలోలో వైద్య శిబిరం

నెల్లూరు చిన్మయ మిషన్ - అపోలో హాస్పిటల్ సంయుక్తంగా 12 తేది అపోలో వుచిత వైద్య శిబిరాన్ని నిర్వహిస్తున్నారు. ప్రముఖ నేత్ర వైద్య నిపుణులు పరీక్షలు చేయడంతో పాటు అవసరమైన వారికి ఆపరేషన్లు చేస్తారట. పినాకిని టివరెజస్ ఎం.డి. బి. చిరంజీవం సౌజన్యంతో ఏర్పాటవుతున్న శిబిరాన్ని శ్రీ స్వామిని శారదా ప్రియానంద ప్రారంభిస్తారు. ప్రజలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని అపోలో ఎం.డి. డాక్టర్ ఎన్. చంద్రశేఖర్ రెడ్డి కోరుతున్నారు.

### నెల్లూరులో గీతా జ్ఞానయజ్ఞం

చిన్మయమిషన్ 9 తేదీ నుంచి16 తేదీ వరకు శ్రీ స్వామిని శారదా ప్రియానందచే భగవద్గీత 17వ అధ్యాయంలోని శ్రద్ధాత్రయ విభాగం పై వుపన్యాసాలు ఏర్పాటు చేసింది. ప్రతి రోజు సాయంత్రం 6.30 నుండి 8 వరకు ఇవి సాగుతాయి. అదే విధంగా 10 తేది నుండి 16 వరకు శ్రీ షిర్డి సాయి బాబా మందిరంలో జరిగే సూర్యోపనిషత్ కార్యక్రమాన్ని రిటైర్డ్ జిల్లా జడ్జి శ్రీ కె.వి. నారాయణ రావు ప్రారంభిస్తారు. శ్రీ స్వామిని శారదా ప్రియానంద ప్రతి రోజు వుదయం 6 గంటల నుండి 7 గంటల వరకు ఉపనిషత్ సారాన్ని చెబుతారు. ఆధ్యాత్మిక జీవులకు భక్తి, ముక్తి ప్రసాదించే కార్యక్రమాలివి.

### కుటుంబ నియంత్రణ పై పబ్లిక్ ఫోరం

11 తేది ప్రపంచ జనాభా దినోత్సవాన్ని పురస్కరించుకొని ఇన్‌ఫార్ ఇండియా లిమిటెడ్ బి.సి. హాస్పిటల్‌లో డాక్టర్ల అసోసియేషన్ సౌజన్యంతో పబ్లిక్ ఫోరం కార్యక్రమాన్ని నిర్వహిస్తుంది. పట్టణంలో ప్రముఖ డాక్టర్లు కుటుంబ నియంత్రణకు అమలులో వున్న పద్ధతులను వివరించడంతో పాటు ప్రజల అపోహలు తొలగిస్తారట.

### లయన్స్ నూతన కార్యవర్గం

నెల్లూరు లయన్స్ క్లబ్ సర్వసభ్య సమావేశం జూలై 4 తేదీ జిల్లా ప్రజాపరిషత్ మీటింగ్ హాల్‌లో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన కార్యవర్గ ఎన్నికల్లో ఎస్.ఎస్.వి. రామమోహన్ రావు అధ్యక్షునిగా, డాక్టర్ జి. జయచంద్ర కార్యదర్శిగా కె.ఎన్.ఎన్. కుమార్ కోశాధికారిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. విజయవాడ నుంచి వచ్చిన లయన్స్ మాజీ గవర్నర్ సి.హెచ్. సత్యనారాయణ కొత్త కార్యవర్గం చేత ప్రమాణ స్వీకారం చేయించారు.

### జయసుధ అకాడమీ పోటీలు

నెల్లూరు జయసుధ సాంస్కృతిక అకాడమీ ఈ నెల 26, 27 తేదీలలో రాష్ట్ర స్థాయి సాంస్కృతిక పోటీలు నిర్వహిస్తుంది. కస్తూర్బా కళా క్షేత్రంలో జరిగే ఈ పోటీలలో కూచిపూడి, భరతనాట్యం, బ్రేక్ డాన్సులు, జానపద నృత్యాలు, సినీ, లలిత, జానపద గేయాల పోటీలతో పాటు సాంఘిక, చారిత్రాత్మక, పౌరాణిక ఏక పాత్రాభినయ అంశాలుగా వుంటాయి. ఆసక్తి గల వారు, కార్యదర్శి, జయసుధ సాంస్కృతిక అకాడమీ, 27/82-9, అరిగెల వారి వీధి, నెల్లూరు అనే చిరునామాకు సంప్రదించాలి.

## శాపనార్థాలు

4 పేజీ కొరవ

వేయలేనంత జనం మధ్య మునిసిపాలిటీ స్కావెంజర్లు చీపుర్లు చేతిలో పట్టుకొని నిలబడడం తప్ప వాటిని కదిపిన పాపాన పోలేదు.

టౌన్ బస్సులు ఆత్మకూరు బస్టాండ్ నుంచి దర్గాకు మూడు రూపాయల ఛార్జీ పెంచి దోచుకున్నప్పుడు దామెందుకు వెనుకబడాలని ఆర్టీసీ వారు ఒకటికి రెండింతలు • ధరపెంచికసుమూరు, ఎ.ఎస్.పేట, రూటుల్లో ప్రయాణీకుల జేబులు ఖాళీ చేసారు. 25 మంది సబిన్స్‌పెక్టర్లు,160 మంది కానిస్టేబిళ్లున్నా 15 వేల పైగా విలువ చేసే బంగారు చైన్లు, జేబుల్లో డబ్బు పర్సులు మాయమై పోయాయి. హుషారుగా పనిచేస్తారని కుర్ర కానిస్టేబిళ్లకు వేసిన 'బీటు 'డ్యూటీని టౌన్ కుర్రకారుతో పోటీ పడి నిర్వహించారు. ప్రతి అంగడి దగ్గరా మామూళ్లు దండుకొని జేబులు నింపుకొని తమ పోలీసు ప్రతిభ చాటారు. సౌకర్యాలు కల్పించడంలో విఫలమైన వక్ఫ్ బోర్డు సిబ్బంది దర్గాలో ప్రవేశిస్తున్న వారిని దారికాచి హుండీల్లో కానుకలు వేయకండి, మా కివ్వండని పోటీలు పడి చేతులు చాచి పవిత్రతను పోగొట్టారు.

అన్ని శాఖల అధికారులు తమ అధికారంతో అంతులేని అపవిత్రత నింపాలని చూసినా ప్రజల మనసుల్లో చెదనన్ని రోజులూ రొట్టెల పండుగకు లక్షలాది జనం వస్తూనే వుంటారు!

## సినిమా

9 పేజీ కొరవ

త్వరలోనే ఆయన భారత ప్రధాని అయితీరుతాడు.'' అంది.

అది చదివిన మరో తార ''భర్తలు మార్చే ఈవిడకు పార్టీలు మారడం ఒలెక్కా?'' అని చమత్కరించింది.

లక్ష్మికూతురు ఐశ్వర్యమాత్రం ఇటీవల తల్లి గురించి ఏ విధమైన వ్యాఖ్యానాలూ చేయకుండా జాగ్రత్త పడుతోంది.

### ఆదర్శ నటుడు డాక్టర్ రాజశేఖర్

''ఎంత సంపాదించా మన్నది కాదు ముఖ్యం, ఆ డబ్బును ఎలా సద్వినియోగం చేయాలనేది ముఖ్యం'' అనే డాక్టర్ రాజశేఖర్ తన వాగ్దానాన్ని మరచి పోకుండా ఇతర తారలకు మార్గదర్శకుడయ్యాడు. పదవ తరగతి, ఇంటర్మీడియట్ ఫైనల్ పరీక్షల్లో అద్భుతమైన ప్రతిభ చూపి, ఉన్నతమైన ర్యాంకులు పొందిన విద్యార్థీ విద్యార్థినుల పేర్లను ప్రకటిస్తూ, వారికి త్వరలోనే మెడల్స్ అందజేయ బోతున్నట్లు తెలిపారు. డాక్టర్ రాజశేఖర్ ఛారిటబుల్ ట్రస్ట్ పేరిట ప్రతిభా సంపన్నులకు ప్రతి సంవత్సరం ఈ పతకాలు ఇవ్వబడతాయి.

## చిటికెల పందిరి

9 పేజీ కొరవ

(చంద్రమోహన్), పగటి కలలు కనడం అతడి బలహీనత. వచ్చేది కొద్ది పాటి జీతమైనా భార్య సీత (ప్రభ) సర్దుకొంటూ పోతుంది. మరదలు భాగ్యం (కిన్నెర) పెళ్లి చూపులకు మేనేజర్ (నూతన్‌ప్రసాద్) సెలవివ్వలేదని వుద్యోగానికి రాజీనామా చేయడంతో కష్టాలు ప్రారంభమవుతాయి. కాళ్లరిగేలా తిరిగినా వుద్యోగం దొరకదు. దీనికి తోడు గోరు చుట్టు పై రోకటి పోటులా యాక్సిడెంట్. చికిత్స చేసిన డాక్టర్ (అశోక్ రావు) మంచి మనస్సుతో హోటల్‌లో బిల్ కలెక్టర్ వుద్యోగం ఇప్పించినా దాన్ని చేతులారా పోగొట్టు కొంటాడు. గంపెడు సంతానంతో నక్కలోడు (బాబూమోహన్) చికెన్ బిరియానీలు తింటూ, చిరంజీవి సినిమాలు మొదటి రోజే చూడడం ఎలా సాధ్యమవుతుందో తెలియడం లేదని భార్యతో చెబుతాడు రామారావు. పైసా సంపాదన లేక కుటుంబం పస్తుల పాలవుతుంది. సమస్యకు మరణమే పరిష్కారమని తలచి పిల్లలకు విషాహారాన్ని పెడతాడు. గతంలో మందుల షాపుల యజమాని ఆత్మహత్య చేసుకోవాలని సిద్ధ పడినప్పుడు రామారావు పార్కులో పిల్లలకు చెబుతున్న నీతితో ఆ ప్రయత్నాన్ని విరమించు కొంటాడు. ఆ కృతజ్ఞతతో విషం కాక మరొకటి ఇస్తాడు. ఇంతలో సీత నక్కలవాడ్ని కలసి అతని కుటుంబం సంతోషంగా వుండడానికి కారణం తెలుసుకొని పిల్లలతో ఆ విషయాన్ని చెప్పి అందరూ కలసి పని చేయాలన్న నిర్ణయానికి వచ్చేయడంతో చిత్రం పరిసమాప్త మవుతుంది.

మూల కథ సంక్షిప్తమైనా యం. జయశ్రీ అరుణ్ కుమార్ రాసిన స్క్రీన్ ప్లే వల్ల ఎక్కడా విసుగని పించదు. కోరికలు తీరినా మొక్కులు చెల్లించినందుకు వెంకటేశ్వర స్వామిగా (నరేష్), యాదగిరి లక్ష్మి నరసింహ స్వామిగా (కోట శ్రీనివాస రావు) చంద్రమోహన్‌ను వేధించను వచ్చి వారే వేధింప బడడాన్ని చూసి ప్రేక్షకులు మనసారా నవ్వుకొంటారు. వీరిద్దరే గాక భానుచందర్, వర్ధమాన నటి రోజా కూడా అతిథి పాత్రలలో కన్పిస్తారు. 'గుట్టు గుట్టుగా' పాటలో రతీ మన్మథుల ప్రయోగం సరికొత్తదనాన్ని చూపగా '. ఏది జరిగినా అది మంచికే' పాట ఆలోచింప చేస్తుంది. ఛూం మంత్రకాళి పాటతో పాటు పలుచోట్ల షూటింగ్ చూస్తున్నజనం తెరపై కన్పిస్తారు. నటి నటుల్లో చాలా రోజుల తరువాత వెండి తెరపై కనిపించిన ప్రభ తనలో నటన ఏ మాత్రం తీసి పోలేదనిపించింది. చంద్రమోహన్‌కు ఇటువంటి పాత్రలు కొట్టిన పిండి. నక్కలోడిగా బాబూమోహన్, మూగవాడిగా సారథి మెప్పించారు. అక్కడక్కడా అతి సిన్నె వున్నా తానే కథ, మాటలు వ్రాసి దర్శకత్వం వహించిన సుదర్శన్ భట్టాచార్య ఆత్రేయ శిష్యుడైనా ముత్యానికి కుటుంబ సమేతంగా చూడతగ్గ చిత్రం తీయడం విశేషం.

### గూడూరు డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

O.S. NO:143/92

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, పొదలకూరు, Rep by its బ్రాంచిమేనేజరు -వాది

vs

1. లక్కాకుల రమణయ్య (died)
2. బొల్లు పాండురంగయ్య
3. మొల్లంపాటి వెంకటరెడ్డి-ప్రతివాదులు

### నోటీసు

To, D2 - బొల్లు పాండురంగయ్య
D3 - మొల్లంపాటి వెంకటరెడ్డి
పెనుబర్తి గ్రామం, రాపూరు మండలం
నెల్లూరు జిల్లా

వాది బాకీ రాబట్టు నిమిత్తం పైకోర్టులో మి మీద దాఖలు చేసియున్నందున మీరు 21-7-93తేదిన పై కోర్టులో ఉదయం 10గంటలకు హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొని యెడల మీ పరోక్షమున దావా తీర్మానించబడును.

వాయిదా 21-7-93

సి. పరాంకుశరావు
వాదియొక్క న్యాయవాది

### రామచంద్రాపురం సబార్డినేటు కోర్టులో

E.P. 20/1992 : S.C. 67/1991

Between:

గొర్తి సింహాచలం -D.Hr

and

వెలుసూరి ఆదిలక్ష్మి -J.Dr

పై నంబరు వారంటు బాకీ తీర్మానం నిమిత్తం J.Dr. తాలూకు షెడ్యూలు ఆస్తిని 23.7.1993 తేది ఉదయం 10.30 గంటల నుంచి పై కోర్టు వారి ఎదుట బహిరంగ వేలం జరుగును. కావున పాడుకొన దలచిన వారు పాడుకొన వచ్చును. పాట షరతులు D.Hr అడ్వొకేటు గారి వద్ద గాని పై కక్షిదారి ఆఫీసులో కాని దొరుకును.

### షెడ్యూలు

తూ.గో. జిల్లా ద్రాక్షారామ సబు డి.లో చేరిన వెలంపాలెం గ్రామము తాలూకు J.Dr. కు స్వార్జిత సంపూర్ణ హక్కు భుక్తములు గల నివేశ స్థలం అందలి 3-128 నంబరుకు గల బంగాళా పెంకులు యింట్కి హద్దులు కొలతలు.

తూర్పు: మీ. 9.14 లు అనసూరి సూర్యారావు గారి యిల్లు; పడమర: మీ. 9.14 లు యాట్ల అప్పారావు వగైరాల స్థలం; ఉత్తరం: మీ. 14.43 లు కొప్పిశెట్టి వెంటయ్య స్థలం; దక్షిణం: మీ. 14.43 లు అనసూరి గోగులు స్థలం.

సదరు హద్దులు మధ్యస్తమైన నివేశ స్థలం అందలి డోరు నెం. 3-128 రు గల బంగళా పెంకుల యిల్లు తల్పులు. ద్వారబంధములు పై కప్పుతో సహా వేలం కావలెను.

D.Hr కిమ్మత్తు రూ. 10,000/-లు
ఆమినా కిమ్మత్తు రూ. 25,000/-లు

వెన్నేటి వీరబద్ధి రాజా
D.Hr తరపు అడ్వొకేటు

## జనవాణి

(3 పేజీ కొరవ)

అలోచనలో పడి వివిధంగా వుంచి స్మగ్లింగు, దొంగలు, గూండాల దగ్గర కూడా పార్టీల వారు విరాళాలు వసూలు చేయటం, కోచవిధం. అంతేకాక దొంగలో ఓగిరాలల కాళ్ళు నిగిపట్టు రాజకీయ నాయకులు పోటీ పడి గురుమించి గింజ పాపిత గుర్తుకు తెస్తున్నారు. ఇదే గాని దేశ ప్రగతి నడి వెళ్ళి ముంచుతున్నా మన్న భావనకు రాలేక పోతున్నారు.

కొచ్చిన్ —ఎస్. రామచంద్రా రెడ్డి

### కండలేరు జలాశయం పూర్తయ్యేదెప్పుడు?

3 లక్షల ఎకరాలు వ్యవసాయయోగ్యం చేయడంతో పాటు, మద్రాసు ప్రజల దాహార్తికి నీరు సరఫరా చేయుగల కండలేరు జలాశయం పథకం పనులు ప్రస్తుతం జరగడం లేదు. ఈ జలాశయం పనులు పూర్తి కావడానికి మరో వంద కోట్లు అవసర మవుతాయి.

ఈ నిధిని పబ్లిక్ ఋణం ద్వారానో, విదేశ ఋణం ద్వారానో పొందవచ్చు. ఆ పని తక్షణం చేయక సంవత్సరానికి అంతో, ఇంతో కంటి తుడుపు చర్యగా విడుదల చేస్తే వ్యయం నానాటికీ అధికమై అనుకొన్న లక్ష్యం నెరవేరక పథకం ప్రక్క త్రోవ పట్టిపోతుంది.

నెల్లూరు —ఆచార్య పి.సి. రెడ్డి

### సెక్స్ శక్తి సామర్థ్యాల పై ఆధార పడిలేదు

పురుషుని శక్తి సామర్థ్యాల పై సెక్స్‌లోని ఆనందం ఆధారపడి వున్నదన్న అభిప్రాయం ప్రపంచం మొత్తం మీద పలువురి మనస్సుల్లో నాటుకు పోయి వుంది. పలు మందుల కంపెనీలు ప్రజల అపోహలను ఆసరాగా తీసుకొని యీ శక్తి సామర్థ్యాలు పెంచేందుకని కొన్ని మందులు మార్కెట్‌లో ప్రవేశ పెట్టి కోట్లు గడిస్తున్నాయి. కాని సెక్సాలజీ గుర్తింపు పొందుతున్న అమెరికా వంటి దేశాల్లో అటువంటి మందులను బ్యాన్‌చేశారు.

అసలు విషయమేమిటంటే మానవుల్లో సెక్స్ సుఖం స్త్రీ, పురుషుల మనోభావాల పై ఆధార పడి వుంది. భావాలలో పొరపాట్లు లేనప్పుడు ఆరోగ్యం సెక్స్ సుఖానికి దోహదం చేస్తుంది. మనోభావాల్లో పొరపాట్లు వున్నప్పుడు ఆరోగ్య వంతులు కూడా సెక్స్ సమస్యలకు గురవుతారు తప్ప శక్తి సామర్థ్యాల పై ఈ విషయం ఆధార పడి లేదన్నది నిజం.

నెల్లూరు —ఇ. రాజగోపాల రెడ్డి

### ఈ నిర్లక్ష్యానికి ఎవరు మూల్యం చెల్లించాలి

ఎస్.వి. యూనివర్శిటీ నిర్వహించే ఎం.ఎ. కరస్పాండెంట్ పరీక్షలు జూలై 1 తేది ప్రారంభ మయ్యాయి. పరీక్షకు హాజరయ్యే వారి హాల్ టిక్కెట్లను యూనివర్శిటీ 25 తేది పోస్టు చేసింది. కాని ఆ కవర్ నెల్లూరుకు 3 తేది చేరింది. హాల్ టిక్కెట్ రాలేదని నేను పడిన ఆందోళన అంతా ఇంతా కాదు. హాల్ టిక్కెట్ కోసం రెండు రోజుల ముందు తిరుపతి ప్రయాణం - దాని వల్ల వ్యయం, ప్రయాస. అంతకూ పోస్టు చేసిన కవర్ వారం రోజులు ఎక్కడుండింది? ఈ నిర్లక్ష్యానికి ఎవరు మూల్యం చెల్లించాలి?

నెల్లూరు —టి. శాలిని

### ఇరకం

2 పేజీ కొరవ

టవర్లు నిర్మించవలెను. తీగలు లాగవలసి వచ్చింది. ఎన్ని ఆటంకాలో, ఎన్ని అభ్యంతరాలో చెప్పలేము. నేల పట్టు పక్షుల రక్షిత కేంద్రం వారిది పెద్ద ఆక్షేపణ- కరెంట్ తీగలు తగిలి పక్షులు చస్తాయని. బ్రతికుండే మనుషులు చస్తే ఫర్వాలేదా అని పెంచలయ్య వారితో తగువు పెట్టుకున్నాడు. వారి అభ్యంతరాలు తప్పించే సరికి తల ప్రాణం తోకకు వచ్చింది. జనార్దనరెడ్డి ముఖ్యమంత్రి కావడం ఒక అదృష్టం. నిధుల కొరత తీరింది. ఇన్నేళ్ల ప్రయాస తర్వాత మొన్న 6తేది ఇరకం లో విద్యుత్ దీపాలు వెలిగాయి. దీవి వాసుల సంతోషానికి పట్ట పగ్గాలు లేవు. బొట్లు పేల్చి, రంగులు చల్లుకొని ఆనందించారు. అనంత వీధిలో మినుకు మినుకు మనే కాగడలి, విశాలమైన పులికాట్ సరస్సు మధ్య చీకట్లో మ్రగ్గుతుండిన ఇరకంలో ఇప్పుడు వెలుగులు కన్పిస్తున్నాయి. పెంచలయ్యకు మంత్రి పదవి వుండవచ్చు, పోవచ్చు; ఎమ్మెల్యేగా గెల్వవచ్చు, ఓడవచ్చు. గాని ఇరకం చిన్న చరిత్ర పుస్తకాలలో ఆయన పేరు పెద్దక్షరాలతో వ్రాసి పెట్టి వుంటుంది.

6 తేది జనార్దనరెడ్డి గారు కొండబోట్ స్విచ్చాన్ చేశారు. దుగరాజ పట్నం నుంచి ఇరకం వరకు మంచినీళ్లు, ఉప్పునీళ్లు వేరు చేసే చెక్ డ్యాంలు నిర్మిస్తామని, 1900 పక్కా ఇళ్లు కట్టిస్తామని, తోటల పెంపకానికి 68 లక్షలు వెచ్చిస్తామని, ఇరకం వరకు రోడ్డు వేయిస్తామని, వాగ్దానాలు చేశారాయన. ఇరకంతో పాటు ఇతర దీవుల అభివృద్ధికి రెండున్నర కోట్ల వ్యయంతో పథకాలు చేపడుతున్నట్లు మంత్రి పెంచలయ్య ప్రకటించారు. కలెక్టర్ సాంబశివరావు గారు ఆగష్టు 1 తేదిలోగా సారా త్రాగడం మానక పోతే ఇరకంలో విద్యుత్ దీపాలు ఆర్పేస్తానని మందలించారు.

ఈ సమావేశం కోసం పెంచలయ్య పత్రికల వాళ్లను ప్రత్యేకంగా పిల్చి, ఒక నాటు పడవ ఎక్కించి వదిలేశాడు. అవి పాట్లు కావు. తిండిలేదు, నీళ్లు లేవు, తిరిగి ఇంటికి చేరుతామన్న నమ్మకమూ లేదు. పెంచలయ్యకు విలేఖర్ల మీద ఎప్పటి కోపమో ఈ రూపంలో తీర్చుకున్నాడు. అయితే ఒక్కరోజుకే అట్లా అల్లాడి పోతున్నామే మనం- తరాల తరబడి ఆ నిర్భాగ్యులు ఎన్ని కష్టాలు పడ్డారో కదా అన్పించింది. సబ్‌కలెక్టర్, ఇతర అధికారులు ఎక్కిన ఒక పడవ గాలివాలుకు కొట్టుక పోయింది. చీకటి పడిన తర్వాత వారిని వెతికి పట్టి, వేరే పడవలో ఎక్కించి ఒడ్డుకు చేర్పించారు.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

### మైకా గనులు

మన జిల్లాలో మైకా గనులు అపారంగా నడుస్తున్నవి యీ దినాల్లో, మైకా యీనాడు యుద్ధోపకరణంగా ఎంతో ఉపకరిస్తున్నది. గాని ఈ గనులకు పోవుటకు తగిన వసతులేమీ లేవు. ఇదే పరాయి దేశాల్లో అయితే అన్ని గనుల వద్దకు సిమెంటు రోడ్లు పడేవి. యెన్నో ఆసుపత్రులు, ఎన్నో స్కూళ్లు, యెన్నో పోస్టాఫీసులు పడేవి. కానీ ఇదేం ఖర్మో యిక్కడ ఏ సౌకర్యమూ లేదు. 26 ఏండ్లనాడు ప్రారంభించిన ఆ డేగపూడి రోడ్డు గూడ ఈనాటికి వెంకటగిరి రిపేర్ల మాదిరే ఏడుస్తున్నది. కావున మైకా గనుల ఓనర్లు ప్రతిదినం దర్శనమిచ్చే అధికార్ల ద్వారా వ్రాయించి, జాయింటు మైకా మిషన్ వారి చేత గూడ సిఫార్సు చేయించి పై సౌకర్యాల కై ప్రయత్నింతురు గాక.

* * *

- విమర్శకుడు





జులై 1వతేది గూడూరులో రోటరి జిల్లా(3166)గవర్నరుగా శ్రీ సోమశేఖర గారి వద్ద నుండి పదవి బాధ్యతలు స్వీకరిస్తున్న



గూడూరు ఇన్నర్ వీల్‌క్లబ్ ప్రెసిడెంట్‌గా ఎన్నికై శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి గారి ఆధ్వర్యంలో ప్రమాణ స్వీకారం చేస్తున్న



Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Paper Products (India) Limited.